C PSL01C440

# భారత కమ్యూనిస్టుపార్టీ ముసాయిదా కార్యక్రమం



మార్క్సిస్టు ప్రచురణలు,
బకింగ్‌హాంపేట P.O.
విజయవాడ-2.

PSLO1C440

# ముసాయిదా కార్యక్రమం

(1) ఒకవైపున హిట్లర్ జర్మనీ నాయకత్వానవున్న ఫాసిస్టు రాజ్యాల సైనిక ఓటమి; మరోవైపున ఫాసిస్టు దురాక్రమణదార్లను తుత్తునియలు చేయడంలో సోవియట్ యూనియన్ నిర్వహించిన నిర్ణయాత్మక పాత్ర. ఈ రెండుఘటనలూ సోషలిజానికి అనుకూలంగా ప్రపంచంలోని వర్గశక్తుల బలాబలాల్లో తీవ్రమైనమార్పు తెచ్చాయి. యుద్ధంలో జర్మన్, ఇటాలియన్ జపానీస్ ఫాసిస్టు కవ్వింపుశక్తులు తిన్న చావుదెబ్బ, ఈ రాజ్యాలను చాలకాలంపాటు తలెత్తుకోనీయకుండా చేయడమేగాక, ప్రపంచస్థాయిలో సామ్రాజ్యవాదం జనరల్‌గా బలహీనపడేటట్లుచేసింది. తూర్పుయూరప్‌లోని అనేకదేశాలలో ప్రజల ప్రజాతంత్ర (పీపుల్స్ డెమోక్రసీ) ప్రభుత్వాలు ఏర్పడ్డాన్ని నిరోధించడం అంతర్జాతీయ సామ్రాజ్యవాదానికి అసాధ్యమని రుజువైంది. తద్వారా సోవియట్ నాయకత్వాన ప్రపంచసోషలిస్టు శిబిరం ఏర్పడ్డానికి దోహదపడింది. సోషలిజం సాధించిన ఈ చరిత్రాత్మక విజయాలకూ, సామ్రాజ్యవాదం పొందుతున్న అపజయాలకూ ఉత్తేజంపొంది, వలసపాలనకు వ్యతిరేకంగా శక్తివంతమైన జాతీయవిముక్తి పోరాటాలు ఆసియాదేశాలన్నిటా వ్యాప్తి చెందాయి. బ్రిటిష్‌సామ్రాజ్యవాదపాలనకు వ్యతిరేకంగా భారతదేశం కూడా బ్రహ్మాండమైన ప్రజావెల్లువను చూచింది.

(2) నానాటికీ తీవ్రతరమవుతున్నాయి పోరాటాలు. ఇవి సాధారణ జాతీయ తిరుగుబాటుగా రూపుదాల్చే ప్రమాదం ఏర్పడింది. ఇది చూచిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దేశంలో తమ ప్రత్యక్షపాలనను కొనసాగించడం యింకెంతమాత్రం సాధ్యంకాదని గుర్తించారు. ఇదిలా

వుండగా మరోవైపున, జాతీయవిముక్తి ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న బూర్జువావర్గం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంగనుక జనరల్ తిరుగుబాటుగా పరిణమించినట్లయితే సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాఉద్యమంపై నాయకత్వం తమ చేతులనుండి జారిపోతుందని భయపడ్డారు. ఈ పరిస్థితులలో, ఒకవైపున బ్రిటిష్ సామ్రాజ్యవాదులకూ జాతీయకాంగ్రెస్ నాయకులకూ మధ్య, మరోవైపున బ్రిటిష్ సామ్రాజ్యవాదులకూ ముస్లింలీగ్‌కూ మధ్య ఒప్పందం కుదిరింది.

(3) ఫలితంగా, దేశం భారత — పాకిస్తాన్‌లుగా రెండుగా విభజితమైంది. 1947 ఆగస్టు 15 న రాజకీయాధికారం కాంగ్రెస్‌పార్టీ నాయకులకు బదిలీచేయబడింది. ఆవిధంగా భారతదేశంపై బ్రిటిష్‌వాళ్ళ రాజకీయపాలన అంతమైంది. భారత బూర్జువావర్గమనే నూతనవర్గం అధికారంలోకి వచ్చింది. దీనితో భారతవిప్లవంయొక్క ప్రథమదశ-అంటే ప్రధానంగా విదేశీ సామ్రాజ్యవాదపాలనకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడ్డ జనరల్ జాతీయైక్యసంఘటన [జనరల్ నేషనల్ యునైటెడ్ ఫ్రంట్] దశ ఆఖరికి చేరుకున్నది.

(4) తమ రాజకీయాధికారం తమచేతులు దాటిపోయినప్పటికీ మన ఆర్థికరంగంపైన తమపట్టును ఎప్పటికీ కొనసాగించుకోవచ్చుననీ, మన సంపదను శ్రమశక్తినీ దోచుకొంటూ వుండొచ్చనీ, ఆ విధంగా మన స్వాతంత్ర్యాన్ని నామమాత్రమైనదిగా చేయవచ్చనీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఆశించారు.

(5) ఏమైనప్పటికీ, అప్పటినుంచీ చారిత్రకాభివృద్ధియొక్క గమనం సామ్రాజ్యవాదులకు పూర్తిగా ఆశాభంగకరంగానే వుంటోంది. చైనా మహావిప్లవంయొక్క చరిత్రాత్మక విజయమూ, మూడింట ఒక వంతు మానవాళిని ఆవరించివున్న శక్తివంతమైన సోషలిస్టు శిబిరం

ఏర్పడి, సుస్థిరం కావడమూ, ఈ శిబిరం ఆర్థిక సైనికశక్తిలో నిరంతరం అకుంఠితమైన అభివృద్ధి సాధించడమూ, పెట్టుబడిదారీదేశాలలో బలమైన కార్మికోద్యమాలు తలెత్తడమూ, ఆసియా ఆఫ్రికాలో జాతీయ విముక్తిపోరాటాలు వెల్లువలా ఉప్పతిల్లడమూ, మరింతతీవ్రతరమవుతున్న వైరుధ్యాలమూలంగా సామ్రాజ్యవాద శిబిరం మరింత బలహీనపడ్డమూ- ఈ పరిణామాలన్నీ ప్రపంచశక్తుల బలాబలాల్ని సమూలంగా మార్చాయి; భారతదేశం తన సార్వభౌమాధికారాన్ని మరింత గట్టిపర్చుకొని, స్వాతంత్ర్యాన్ని సుస్థిరంచేసుకొనేందుకు దేశప్రజలకు అత్యంత సానుకూల పరిస్థితుల్ని కల్పించాయి.

(6) భారత విప్లవంయొక్క ప్రథమదశ, అంటే బ్రిటిష్ బానిస బంధనాలనుండి పొందిన రాజకీయ విముక్తితోనే తమ యాత్ర పూర్తి యిందని ప్రజాబాహుళ్యం భావించలేదు. ఈ రాజకీయ స్వాతంత్ర్యం యొక్క అర్థం,మన ప్రియతమ భారతచరిత్రలో ఒక నూతన మహత్తర శకం ఆరంభమైందనే ప్రజాబాహుళ్యం ఎంచుకొన్నది. వారు సహజంగానే, రాజకీయ స్వాతంత్ర్యక్రమాన్ని ముందుకుతీసుకుపోవాలనీ,సాంఘిక న్యాయమూ సుఖసౌభాగ్యాలూ, త్వరితగతిని సమగ్రాభివృద్ధిని గొనివచ్చే పునాదులపైన దేశాన్ని పునర్నిర్మించాలని ఆశించారు. దేశదారిద్ర్యమూ, ఆర్థికదాస్యమూ, బడుగుస్థితి సమస్యలకు పరిష్కారమార్గంకోసం ప్రజాబాహుళ్యం చాలకాలంగా వేచివున్నారు.

(7) మనసూరితే నూతనంగా స్వాతంత్ర్యంపొందిన దేశాలప్రజలకూ లేదా తమ జాతీయవిముక్తికోసం యింకా పోరాడుతున్న ప్రజలకూ ఎంతో అనుకూలంగా మారిపోయిన శకమిది. ఈ శకంలో మన ప్రజలు జాతీయ పునరుజ్జీవన కర్తవ్యాలను ఎదుర్కొంటున్నారు. మాన వాళిలో మూడింట ఒకవంతు జనాభా పెట్టుబడిదారీ విధానంనుండి తెగ

తెంపులు చేసుకొన్నారు: ఇప్పటికీ ప్రజలంతా ప్రపంచసోషలిస్టు వ్యవస్థ క్రింద వున్నారు. దేశాలకు దేశాలనే దాస్యత్వంలో ముంచెత్తి విధ్వంసం చేసిన సామ్రాజ్యవాదమూ, వలసవిధానమూ నేడు త్వరితగతిని కృంగి కృశించిపోతోంది. మనం వుంటున్నది. వలసవ్యవస్థ రద్దయే శకం. వలసవ్యవస్థా శిధిలాలపై నూతన స్వతంత్రదేశాలు ఆవిర్భవిస్తున్నాయి. ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ఖండాలలో నూతనంగా విముక్తి పొందిన ఈ దేశాలు చారిత్రకదశలో ప్రవేశించాయి. వీటిలో మన భారతదేశం ముఖ్యమైనస్థానం వహిస్తోంది.

(8) సమాజ చారిత్రకాభివృద్ధియొక్క ప్రధానవిషయాన్ని, దాని ప్రధానధోరణినీ, దాని ప్రధాన లక్షణాల్నీ నిర్ణయించేవి — సోషలిస్టు పరివర్తనకోసం పాటుపడే ప్రపంచ సోషలిస్టువ్యవస్థ, సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి పోరాడే శక్తులూ, సమాజాభివృద్ధిలో ప్రపంచ సోషలిస్టువ్యవస్థ ఒక నిర్ణయాత్మకమైన శక్తవుతోంది.

(9) చరిత్ర పురోగతిని అడ్డుకోవడం సామ్రాజ్యవాదానికి ఇంకెంతమాత్రమూ సాధ్యంకానిపని; సామ్రాజ్యవాదులు తమ అభీష్టానికి ఇతరదేశాలను లొంగతీసుకోవడంగానీ, లేదా దేశాలను అదిరించి బెదిరించి లొంగదీసుకోవడంగానీ ఇంకెంతమాత్రమూ సాధ్యంకాని పని; అలాగే లోగడ భారీయంత్రాలపైన సాంకేతికపరిజ్ఞానంపైన తమకున్న గుత్తాధిపత్యాన్ని సామ్రాజ్యవాదులీనాడు బడుగుదేశాల జాతీయపునరుజ్జీవనమార్గాన్ని పూర్తిగా అడ్డుకొనేందుకు వినియోగించడం ఇంకెంతమాత్రం సాధ్యంకానిపని. ఈ దేశాలప్రజలు తమ భవితవ్యాన్ని తమ చేతుల్లోకి తీసుకొన్నప్పుడు మాత్రమే, ప్రజలు దినదిన ప్రవర్ధమానమవుతున్న అఖండ సోషలిస్టు వ్యవస్థయొక్క నిస్వార్థసాయంతో తమ ఆర్థిక పరాధీనతనూ బడుగుస్థితినీ త్వరితగతిని వదిలించుకోగల్గుతారు;

తద్వారా తమ జాతీయస్వాతంత్ర్యాన్ని రక్షించుకొని బలోపేతం చేసుకో గల్గుతారు;ఆవిధంగా తమ ప్రజలకు ఉత్తమభవిష్యత్తును చూపగల్గుతారు.

II

(10) రాజకీయ స్వాతంత్ర్యమూ, తద్వారా ఏర్పడ్డ నూతన జాతీయప్రభుత్వమూ గత వలసవిధానం విడిచివెళ్ళిన దుష్ట అవశేషాలను తుడిచిపెడ్తాయనీ, ఉత్పత్తిశక్తులకు ఆటంకంగావున్న బంధనాలన్నింటినీ తెగ్గొట్టి వాటికి విముక్తి కల్పిస్తాయనీ ఆశించబడింది. ఆవిధంగా మన దేశం సంపద్వంతమైన పారిశ్రామికదేశంగా, ప్రజల భౌతిక సాంస్కృతికావసరాలను మరింతగా సంతృప్తిపరచే పారిశ్రామికశక్తిగా రూపొంద గలదనీ ఆశించబడింది.

(11)భారతవిప్లవంయొక్క ఈ ద్వితీయదశ తన సత్వరఅమలుకోసం ఫ్యూడల్-అర్ధఫ్యూడల్ భూస్వామ్య విధానాన్ని పూర్తిగా రద్దుచేయాలని డిమాండ్ చేసింది; భూమిని వ్యవసాయ కార్మికులకూ, పేద రైతాంగా నికి ఉచితంగా పంచమని డిమాండ్ చేసింది. అలాగే భారత విప్లవం యొక్క ఈ ద్వితీయదశ, తాను సత్వరం పూర్తిగావడానికై బ్రిటిష్‌పెట్టు బడులను స్వాధీనపర్చుకొని జాతీయంచేయాలని డిమాండ్‌చేసింది; ఆ విధంగా మన జాతీయార్థికరంగంపై విదేశీగుత్తపెట్టుబడులకున్న దోపిడీ పట్టును నిర్మూలించాలని డిమాండుచేసింది. భూస్వామ్యవ్యవస్థను రద్దు చేసి, సమూలమైన వ్యవసాయకవిప్లవాన్ని గొనివచ్చినట్లయితే మన వ్యవ సాయోత్పత్తిపై శతాబ్దాలుగావున్న బంధనాలు సత్వరంతెగిపోయివుండేవి. ఫలితంగా వ్యవసాయోత్పత్తి పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ సాగి పోయేది. మన ప్రజలందరికీ తిండి లభించేది. మన పరిశ్రమలకు ముడి సరకులు పుష్కలంగా లభించివుండేవి; నిరంతర వృద్ధిగల మార్కెట్

లభించేగి; ఆవిధంగా మన వ్యవసాయరంగాన్ని మన పరిశ్రమలకు పెట్టు బడి సంచయానికొక ప్రధాన ఆధారంగా మారివుండేది. అలాగే బ్రిటిష్ పెట్టుబడులను స్వాధీనపర్చుకొని వాటిని జాతీయం చేసివున్నట్లయితే, నూతనంగా అధికారంలోకి వచ్చిన జాతీయప్రభుత్వం చేతుల్లో విస్తృత మైన పారిశ్రామికరంగమూ, విదేశీ వ్యాపారమూ వుండివుండేవి; తద్వారా వీటినుంచి వచ్చే లాభాలు,గతంలో మనదేశానికి నష్టదాయకంగాగాకుండా, పరిశ్రమల్లో నిరంతరం పెట్టుబడులను పెంచుకోడాని కొక ఆధారంగా మారాయి.

(12) కాని మన విప్లవంయొక్క ఈ మౌలిక కర్తవ్యాల సాధన యింకా చాలదూరంలోనే వుంది. రాజ్యాంగ యంత్రాన్ని కంట్రోల్ చేస్తున్న కాంగ్రెస్‌పార్టీయొక్క బూర్జువా-భూస్వామ్య నాయకత్వం ఈ అత్యవసర జాతీయ కర్తవ్యాలను నెరవేర్చడంలో విఫలమైంది. ఈవిష యంలో, ఏకచ్ఛత్రాధిపతిగా కాంగ్రెసుపార్టీ గుత్తాధికారం చెలాయించిన పదిహేడు సంవత్సరాల అనంతరం మిగిలిన ఫలితమేమిటో పరిశీలిస్తే అనుమానికి తావుండదు.

(13) సామ్రాజ్యవాదపాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో పాల్గొన్న ప్రధానశక్తి కార్మికవర్గమూ, రైతాంగమూ, మధ్యతరగతి ప్రజలూ, మధ్యతరగతి అభ్యుదయ కాముక మేధావివర్గమే అయినప్ప టికీ, ఈ ప్రధానశక్తే ఆ పోరాటధారాన్ని వహించినప్పటికీ, జాతీయ విముక్తి వుద్యమపు నాయకత్వంలో వుండిపోయింది బడాజాతీయ బూర్జువా వర్గమే. స్వాతంత్ర్య సముపార్జనానంతరం ప్రజాతంత్ర విప్లవంయొక్క మౌలిక కర్తవ్యాలు ఆమూలాగ్రంగా అమలులోకి రావచ్చునేమోనన్న భయంతో, భారత బూర్జువావర్గానికి రాజకీయ ప్రతినిధులైన కాంగ్రెసు నాయకులు సామ్రాజ్యవాదంతో రాజీపడి, బ్రిటిష్ పెట్టుబడులకు తిమ రోపి

దీని కొనసాగించుకోడానికి అవకాశం కల్పించడానికి అంగీకరించడమే గాక, మన ఆర్థికరంగంలోకి అమెరికా తదితర సామ్రాజ్యవాద పెట్టు బడులు మరింత చొచ్చుకొనివచ్చి అవి మరింత పెరిగేందుకుకూడా అవ కాశాలు కల్పించారు. ఫ్యూడల్ రాకుమారులకు పెద్దపెద్ద సౌకర్యాలు కల్పించారు. తమ వర్గ ప్రభుత్వాన్ని బలపర్చుకొనేందుకై వారి సఖ్యత కోసం చేతులు చాచారు.

కాంగ్రెసు ప్రభుత్వం ప్యాసుచేసిన వ్యవసాయికచట్టాల మూలం కంగా ఫ్యూడల్-అర్ధఫ్యూడల్ భూస్వామిక విధానం రూపంలో కొంత మార్పుమాత్రమే వచ్చింది. వీటివల్ల భూస్వాములకు కలిగేనష్టం అత్య ల్పము మాత్రమే. రైతాంగంలోని ఉన్నతతరగతులకు మాత్రమేమేలు కల్గింది. కాని, రైతాంగంలోని అత్యధిక సంఖ్యాకులకు కల్గిన ప్రయోజ నాలు శూన్యమే.

జాతీయ బూర్జువా వర్గానికి ప్రతినిధులైన ఈ కాంగ్రెసు నాయి కులు, ప్రజాబాహుళ్యాన్ని అణచిపెట్టడంకోసం బ్రిటిష్‌వాళ్ళు తరిఫీదు చేసిపోయిన నిరంకుశాధికారా (బ్యురాక్రసీ)న్ని చెక్కుచెదరకుండా అలాగే అట్టిపెట్టారు. ఆవిధంగా ప్రజాతంత్ర విప్లవం మరింత పూపు నందుకోకుండానూ అడ్డుకున్నారు: అలాగే ఆ విప్లవమౌలిక కర్తవ్యా లనూ నెరవేర్చలేదు.

(14) మనకాలంలో జాతీయ విముక్తి ఉద్యమాల చారిత్రకాను భవం ఏమిచెపుతోందంటే, స్వాతంత్ర్యపోరాటానికి నాయకత్వం బూర్జువా వర్గానిదే అయినట్లయితే అది (బూర్జువావర్గం - అను) జాతీయ ప్రజాతంత్ర విప్లవాన్ని కడకంటా తీసుకుపోదని చెపుతోంది. అలాగాక ఇందుకు భిన్నంగా, దేశం రాజకీయ స్వాతంత్ర్యం పొందిన తరువాత ఈ వర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడింది: దేశీయ భూస్వామ్య అభి

వృద్ధి నిరోధకవర్గంతో చేతులు కలిపింది. అలాగే చారిత్రకానుభవం మరోవిషయాన్నికూడా ఋజువుచేసింది: సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ సంఘటన కార్మికవర్గం నాయకత్వాన వున్నప్పుడు మాత్రమే, ప్రజాతంత్ర విప్లవంయొక్క అన్నిదశలూ పూర్తిగా కడకంటా నెరవేర్చబడ్డమేగాక, ఈ ప్రజాతంత్ర విప్లవం ప్రజాతంత్ర దశవద్దనే ఆగిపోకుండా, సోషలిస్టు విప్లవదశకు త్వరితగతిని వెళ్ళిపోగల్గుతుంది. అసంపూర్ణమైన భారతవిప్లవంకూడా ఈ చారిత్రకానుభవాన్నే ధృవీకరిస్తోంది.

## III

(15) స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న సంవత్సరాల్లో జాతీయ బూర్జువావర్గంయొక్క ద్వంద్వస్వభావం, అది ఒకవైపున వాస్తవంలో సామ్రాజ్యవాదానికీ విప్లవానికీమధ్య సమతూకం పెడుతూనే మరోవైపున సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించే విధానాన్ని అనుసరించడంలో వెల్లడైంది. స్వాతంత్ర్య సాధనానంతరం, రాజ్యాంగ యంత్రాన్ని తన ప్రధాన ఆయుధంగా దానిపై బూర్జువావర్గం కంట్రోల్ పొందడంతో ఈ విధానం ఒక కొత్తస్థాయికి గొనిపోబడింది. ఒకవైపున సామ్రాజ్యవాదానికీ ఫ్యూడలిజానికి మధ్య,మరోవైపున సామ్రాజ్యవాదానికీ ప్రజలకూ (బూర్జువావర్గంతోసహా) మధ్యా వైరుధ్యం పెరుగుతున్నప్పటికీ, బూర్జువావర్గం సామ్రాజ్యవాదాన్ని ఫ్యూడలిజాన్ని నిశ్చయాత్మకంగా ఎదుర్కోవడంద్వారా తన పరిస్థితిని బలపర్చుకోవడంగాక, ప్రజలపై దాడిచేయడంద్వారా సామ్రాజ్యవాదంతోనూ, ఫ్యూడలిజంతోనూ రాజీపడీ సమాధానపడ్డంద్వారా తాను బలపడ జూస్తోంది.

(16) స్వాతంత్ర్యం రాకపూర్వంకూడా భారత బూర్జువావర్గానికి కొంత ప్రతిపత్తివుంది: అప్పటికే ఈ వర్గం ప్రత్తి, జౌళి, చక్కెర,

సిమెంటులాంటి కొన్ని పరిశ్రమల్లో నిలదొక్కుకునివుంది. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో జాతీయ బూర్జువావర్గం, ముఖ్యంగా బడావర్గాలు, అపారమైన లాభాలు గుంజుకొని తమ ఆర్థికస్థితిని బాగా పెంచుకున్నారు.

(17) స్వాతంత్ర్యం వచ్చినతరువాత, పాలక బూర్జువావర్గం సమాజంలో తన వర్గపరిస్థితిని మరింత బలపర్చుకునేందుకుగాను దేశ ఆర్థికరంగాన్ని పెట్టుబడిదారీ పద్ధతులపై అభివృద్ధిచేయ పూనుకొన్నది. ఈ సమయంలో ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి: భారత బూర్జువా వర్గం ఏ సమయంలో పెట్టుబడిదారీ అభివృద్ధిమార్గాన్ని ఎంచుకొన్న దంటే, ప్రపంచ పెట్టుబడిదారీవ్యవస్థ త్వరితగతిని విచ్ఛిన్నమవుతున్న దశలో ఈ మార్గాన్ని ఎంచుకొన్నది; పెట్టుబడిదారీ జనరల్ సంక్షోభం యొక్క మూడవదశలో ప్రజలు పెట్టుబడిదారీవ్యవస్థ ప్రవేశించినదశలో ఈ మార్గాన్ని ఎన్నుకొన్నది. కాని భారత బూర్జువావర్గానికి భారీపరిశ్రమకు కావాల్సిన సాంకేతిక పునాదీలేదు, అలాగే సామ్రాజ్యవాదులకు అపారమైన పెట్టుబడులను సమకూర్చిపెట్టిన దోపిడీ వలస సామ్రాజ్యవాదానికి లేదు; అందువల్ల ఈ బూర్జువావర్గం తానుపొందిన రాజ్యాంగాధికారాన్ని తన స్వంతపెట్టుబడి అవసరాలకు, పెట్టుబడిదారీపద్ధతుల్లో ఆర్థికరంగాన్ని అభివృద్ధి చేసేందుకుగాను దేశంలోని సామాన్యప్రజల శ్రమఫలితాల్ని దోచుకొనేందుకు వినియోగిస్తున్నది. స్వాతంత్ర్యం వచ్చిందిలగాయతూ కాంగ్రెస్ ప్రభుత్వం అనుసరిస్తున్న ఆర్థికవిధానాలు నిరంతరం ఈ మార్గంవైపుకే ఎక్కుపెట్టబడ్డాయి.

(18) తన ప్రయోజనాలసాధనకోసం భారత బూర్జువావర్గం, బ్రిటిష్-అమెరికన్ సామ్రాజ్యవాదుల సహాయంపై ఆధారపడింది. దీనికి పుట్టిన ప్రతిఫలం ఏమిటంటే, 1947 నాటికి కనీసపు ఎరగనంతటి

[2]

పూహూ బలమూ పొందుతున్న ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట వెల్లువనుండి ఈ తమ (బూర్జువావర్గం — అను) ప్రయోజనాలు రక్షించ బడ్డం.

(19) కాని స్వాతంత్ర్యం వచ్చినతరువాత సంవత్సరాలలో బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాదులు, భారత బూర్జువావర్గ అవసరాలను తీర్చలేమ సరికదా, అనేకరకాల వత్తిడి వుపయోగించి నూతన భారతప్రభుత్వాన్నే తమ యుద్ధపథకాలలోకి లాగపూనుకొన్నారు: సాధించిన రాజకీయ స్వాతంత్ర్యాన్నికూడా వమ్ముచేసే పథకాలు వేయపూనుకొన్నారు. భారత బూర్జువావర్గం పదేపదే అర్థించినాగాని సామ్రాజ్యవాదులు, దేశపారిశ్రామికీకరణకు పునాదియైన భారీపరిశ్రమల నిర్మాణానికి సాయపడ నిరాకరించారు. రెండో ప్రపంచయుద్ధకాలంలో మన ప్రజలు శ్రమించి చెమటోడ్చిన ఫలితంగా భారతదేశానికి దక్కిన అపారమైన స్టెర్లింగ్ నిల్వలు కరిగిపోయేటట్లు వత్తిడితెచ్చారు. విదేశీ మారకద్రవ్యాన్ని పొదుపుచేసుకోడానికి సాయపడమన్న సాకుతో వారు, నూనెశుద్ధికర్మాగారాలు, నౌకానిర్మాణం, యంత్రపరికరాలు వగైరా విషయంలోలాగా మన జాతీయప్రయోజనాలకు ప్రమాదమైన విదేశీ గుత్తపెట్టుబడిదారులతో ఒప్పందాలు కుదుర్చుకొనేటట్లు బలవంతంచేశారు.

(20) నూతనంగా విముక్తిపొందిన దేశాలు త్వరితగతిని ఆర్థిక వెనుకబాటుతనంనుంచి బయటపడేందుకు, ప్రపంచసోషలిస్టువ్యవస్థ ఏర్పడ్డమూ అది బలోపేతంగావడమూ కొన్ని కొత్త అవకాశాల్ని కల్పించాయి. కాని మనదేశ బూర్జువావర్గం గతంతో పూర్తిగా తెగతెంపులుచేసుకొని, వలసపాలనావశేషాలన్నింటినీ తుడుముట్టించడానికి నిరాకరిస్తోంది. భారీపారిశ్రామిక సంస్థలు కొన్నింటి నిర్మాణానికై ఈ బూర్జువావర్గం సోషలిస్టుదేశాల సహాయం వినియోగించుకొంటూనే,

వాస్తవంలో ఆ సహాయాన్ని ఆ వర్గం సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడు లతో మరింత అనుకూల ఒప్పందాల్ని కుదుర్చుకొనేందుకు అత్యంత ఉపయోగకర బేరసారాల పనిముట్టుగా వినియోగిస్తోంది.

## IV

(21) భారతదేశంలో పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మించే ప్రయత్నాలలో ప్రభుత్వం ఆర్థికప్రణాళికాపద్ధతికి పూనుకొన్నది. ఈ ఉద్దేశంతోనే ఇప్పటికి మూడు పంచవర్ష ప్రణాళికలు రచించబడ్డాయి: ఈ ఉద్దేశంతోనే అవి అమలుజరుపబడుతున్నాయి. ముందుగానే ఇక్కడొక విషయాన్ని స్పష్టంచేయాలి; కాంగ్రెస్‌పార్టీ-నాయకులు సోషలిజం అంటూ ఎంత పెద్దగా మాట్లాడుతున్నా ఈ ప్రణాళికా పద్ధతికీ సోషలిస్టు ప్రణాళికా పద్ధతికీ ఏమాత్రం పొంతనలేదు. మన ఆర్థికరంగంలోని బహుకొద్దిభాగం మాత్రమే ప్రభుత్వరంగంక్రింద వుంది; విశాలమైన పారిశ్రామిక శాఖలూ వాణిజ్యవ్యవహారాలు, మొత్తం వ్యవసాయకరంగమూ ప్రయివేట్‌రంగానికె వదలబడ్డాయి. పెట్టుబడిదారీ ప్రణాళికాపద్ధతిని ప్రవేశపెట్టేందుకు ఈ బూర్జువావర్గం చేస్తున్నప్రయత్నాలు పెట్టుబడిదారీ విధాన స్వతస్సిద్ధ [స్వాంతేనియస్] సూత్రాలకు వ్యతిరేకమై కూర్చుంటాయి; తుదకు నిజమైన ప్రణాళికాబద్ధ ఆర్థికవిధానమూ పెట్టుబడిదారీ విధానమూ ఒకదానికొకటి పొసగక, ఈ రెండూకలసి తగినంతదూరం ప్రయాణం చేయలేవు. కాంగ్రెస్‌ప్రభుత్వంక్రింద పంచవర్షప్రణాళికలనేవి, మన ఆర్థికరంగంలో ముందడుగులువేసి ఆర్థికరంగాన్ని సత్వరపారిశ్రామికీకరణ అభివృద్ధిపథకంపైన పెట్టేందుకు దేశంలోని మొత్తం భౌతిక, మానవశక్తి సంపదనంతనూ సమీకరించేవిపోయి, ప్రధానంగా పోషిటీవర్గాల లాభార్జనా సూత్రంపైనే ఆధారపడ్డాయి. సరిగ్గా ఈ కారణా

లన్నింటివల్లనే మన పెట్టుబడిదారీ ప్రణాళికాకర్తలు, 1960 లో సింహళ దేశంలో తలసరిఆదాయం ఎంతవుందో అంతకుచేరుకోవడానికిగాను 1975 వరకూ ఓపికపట్టవలసిందిగా మన ప్రజల్ని బహిరంగంగానే అడుగుతున్నారు. ఇందుకు వారు సిగ్గుపడ్డంలేదు.

(22) ఏమైనప్పటికీ, భారతదేశంలాంటి బడుగుదేశంలో బూర్జువావర్గం చేతుల్లోవున్న రాజ్యాంగాధికారం అండతోసాగే ఆర్థిక ప్రణాళికలు పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధికి ఖచ్చితంగా వూపునిస్తాయి, ఒక మార్గాన్ని చూపిస్తాయి. ఎట్లా? పెట్టుబడిదారీపద్ధతిలో పారిశ్రామికీకరణ ప్రయోజనాలదృష్ట్యా, దేశంలో అందుబాటులోవున్న వనర్లన్నింటినీ మరింత త్వరితగతిని వినియోగించుకోడానికి అవకాశం కల్పించడం ద్వారా ఈ పనిచేస్తుంది. ఈ ప్రణాళికలయొక్క అతిముఖ్యమైన లక్షణ మేమిటో, పారిశ్రామిక విస్తరణలో ముఖ్యంగా ప్రభుత్వరంగంలో కొన్ని భారీ, యంత్రనిర్మాణ పరిశ్రమల స్థాపనలో చూడొచ్చు. వాస్తవానికి సోషలిస్టుదేశాలనుండి ముఖ్యంగా సోవియట్‌యూనియన్‌నుంచి స్వార్థరహితమైన సహాయం వచ్చివుండకపోతే ఈ గణనీయమైన లాభం కూడా మనకు సాధ్యమైవుండేదిగాదు. ఈ సాయం సామ్రాజ్యవాదులు కల్పించిన ప్రతిబంధకాలను అధిగమించడానికి దేశంలోని బూర్జువావర్గానికి దోహదంచేసింది; కొన్నిసందర్భాల్లో బూర్జువావర్గం సామ్రాజ్యవాదులనుంచి అనుకూలమైన ఒప్పందాలు పొందడానికి దోహదపడింది. వీటికిలోడు, ప్రభుత్వరంగంలో రవాణా, రహదార్లు, విద్యుచ్ఛక్తిశాఖలు కూడా తగినంతగా విస్తరించడం జరిగింది.

(23) భారతదేశంలో నేడున్న పరిస్థితులలో, ప్రభుత్వరంగంలో నిర్మించినలాంటి భారీ, యంత్రనిర్మాణపరిశ్రమలు తదితర కీలకపరిశ్రమలు మరోవిధంగా అయితే జయప్రదమైవుండేవికావు. ఎంచేతనంటే,

ఈ భారీ పారిశ్రామిక సంస్థలకు అవసరమైన వనర్లను చూచుకోగల స్థితిలో ప్రయివేట్ పెట్టుబడిలేదు. అందువల్ల ప్రభుత్వరంగంలో ఈ సంస్థలు నిర్మించడంవల్ల, ఆర్థికంగా వెనుకబడివున్నస్థితినీ, సామ్రాజ్య వాద గుత్తపెట్టుబడిదార్లపైన తలవొగ్గి ఆధారపడేస్థితిని కొంతవరకు అధిగమించి, పారిశ్రామికీకరణకు సాంకేతికపునాదిని ఏర్పర్చుకోవడానికి దోహదపడింది.

(24) పబ్లిక్‌రంగమనబడే ప్రభుత్వరంగాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక ప్రజాతంత్ర మార్గాల్లో అభివృద్ధి పరిస్తే, బడుగు ఆర్థికవ్యవస్థలో అభ్యుదయకరపాత్రను నిర్వహించగల దనుకోండి. ఏమంటే అలాఅయితే, ప్రభుత్వపెట్టుబడిదారీవిధానం ఆర్థికపరాధీనతను తగ్గించి, పారిశ్రామికీకరణకు పెట్టుబడికూడే పునాది ఏర్పర్చి బలపర్చుతుంది. అలా అయితే, అది విదేశీపెట్టుబడి పట్టును బలహీనపర్చి, తొలగించడానికీ, భారతదేశంలోని గుత్తవర్గాల పెరుగు దలను అదుపుచేసి ఆపడానికికూడా ఒక సాధనం కాగల్గుతుంది. కాని బడా బూర్జువావర్గ నాయకత్వంక్రింద ప్రభుత్వం గత 17 సంవత్సరాల పాలనలో అనుసరించిన ప్రజావ్యతిరేకవిధానాలు, మూడు పంచవర్షప్రణా ళికలూ ఆచరణలో వాటిఫలితాలూ అలాంటి ఆశలన్నింటినీ వమ్ము చేశాయి. నానాటికీ సంపద కేంద్రీకరణ పెరగడమూ, భారత గుత్త వర్గాలు త్వరితగతిని అభివృద్ధిచెందడమూ కొట్టొచ్చినట్లు కన్పిస్తున్న దృశ్యం. అటు ప్రభుత్వరంగంలోకీ, ఇటు ప్రయివేట్ రంగంలోకీ పెద్దఎత్తున విదేశీ గుత్తపెట్టుబడులు చొచ్చుకురావడమనేది నిరాఘాటంగా సాగిపోతోంది. సామాన్యప్రజలనూ కార్మికుల్ని, రైతాంగాన్ని,మధ్యతర గతి వర్గాలనూ, పెట్టుబడిదారీ అభివృద్ధికోసం సాగుతున్న ఈ ప్రణాళిక లకు డబ్బుకావాలన్న పేరుతో ఘోరమైన దోపిడీకీ, నిర్బంధానికీ గురి చేస్తున్నారు.

కాబట్టి తాము సోషలిజాన్ని నిర్మిస్తున్నామనటానికి ఋజువుగా కాంగ్రెసునాయకుల ప్రభుత్వరంగాన్ని చూపిస్తున్నా వాస్తవం తెలియ జేసేదేమిటంటే భారతదేశంలో ప్రభుత్వరంగమే పెట్టుబడిదారీవిధానాన్ని నిర్మిస్తానికి సాధనంగా వుపయోగపడుతోంది; కాబట్టి అది ప్రభుత్వ పెట్టుబడిదారీవిధానంకాక మరేమీకాదు.

(25) ప్రభుత్వబడ్జెటూ, సాధారణ ఆర్థికవిధానాలూ, ముఖ్యంగా పన్నులు వేయడానికి తీసుకొనేచర్యలూ, దాని ధరలవిధానమూ—ఇవన్నీ సమాజంలో కొద్దిమందిగావున్న దోపిడీవర్గాలచేతనే ప్రధానంగా నిర్ణయించబడుతున్నాయి. పరోక్షపన్నుల్లో విపరీతపెరుగుదలా, లోటుబడ్జెటూ సామాన్య ప్రజాబాహుళ్యాన్ని దెబ్బతీస్తున్నాయి. ఈ రెండుపద్ధతులూ ప్రణాళికలకు డబ్బు సమకూర్చుతున్న ప్రధానవనరులు. ప్రభుత్వం, అభివృద్ధి పేరుతో వాస్తవానికి లాభార్జనదృష్టిపైనే ఆధారపడుతోంది; ధరల స్థాయిని అదుపులోపెట్టేందుకు ఎట్టి గట్టిచర్యా తీసుకో నిరాకరిస్తోంది. ప్రజలు తమ శ్రమశక్తిద్వారా సృష్టించుకొన్న సంపదలో తమ వాటాను అనుభవించకుండా మరింత గుంజివేయడానికీ, ఆ సంపద ప్రయివేట్ పెట్టుబడిదార్ల చేతుల్లో పెట్టుబడిగా పోగుపడ్డానికీ నోట్లముద్రణమూ [లేదా ద్రవ్యోల్బణమూ—అను] చుక్కాలంబుతున్న ధరలూ ప్రధాన శక్తిగా వున్నాయి.

(26) లోటు ద్రవ్యవిధానం ఫలితంగా డిపాజిట్లు పెరిగిపోతున్న బ్యాంకులూ, బీమాకంపెనీలూ [చివరకు జాతీయంచేసిన జీవితబీమా కార్పొరేషన్‌కూడా] ప్రభుత్వం ఏర్పర్చిన "పారిశ్రామిక ద్రవ్య వనర్ల కార్పొరేషన్" జాతీయ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్‌లాంటి ప్రత్యేక పరపతి సంస్థలు [స్పెషల్ క్రెడిట్ ఇన్‌స్టిట్యూషన్స్] అన్నీ ప్రయివేట్ పెట్టుబడి పెరుగుదల ప్రయోజనాలకే వినియోగపడుతున్నాయి.

అంతేగాదు, రిజర్వుబ్యాంకుకు చెందిన సలహాసంఘాలూ జీవితభీమా కార్పొరేషన్‌కుచెందిన పెట్టుబడిసంఘాలూ బడాబూర్జువావర్గ ప్రతినిధుల తోనే నిండివున్నాయి. వీరు పారిశ్రామిక ద్రవ్య వనర్ల కార్పొరేషన్ లాంటి పరపతిసంస్థల డైరెక్టర్లబోర్డులలోనూ, తదితర ప్రభుత్వరంగ సంస్థల్లోనూ వున్నారు.

**(27)** ఇవీ, ఇటువంటివే అయిన ఇతర ప్రభుత్వ విధానాలూ సంపదకేంద్రీకరణ అంతకంతకూ అధికమగుటకు దారితీసినవి.

— మొత్తం పారిశ్రామిక ఉత్పత్తిలో 1948 లో 50% చేసే 10 పెద్ద వ్యాపారసంస్థలు 1960 లో తమ వాటాను 60% కు పెంచుకో గలిగినవి.

— మొత్తం బ్యాంకుల డిపాజిట్లలో 10 బ్యాంకులు 1948 లో రు 280 కోట్లు, అనగా, 50% కలిగివుండేవి; 1960 నాటికి ఈవాటా రు 900 కోట్లకు, అనగా, 70% కు పెరిగింది.

— 4174 డైరెక్టరు పదవులను పరిశీలించగా, వీటిల్లో 2000 పదవులు 44 మంది వ్యక్తులచేతులలోనే వున్నవనీ, అందులోనూ పరి శీలనజేస్తే 10 పెద్ద వ్యాపారసంస్థలకుకల్పి 620 పదవులున్నవనీ తేలింది. తక్కిన 2174 పదవులూ 520 మంది వ్యక్తులకు చెందినవి.

— ప్రైవేటురంగంలోవున్న సుమారు రు 3000 కోట్లు పెట్టుబడి ఆస్తిలో, టాటా, బిర్లా కుటుంబాలకే రు 600 కోట్లు, అనగా ⅕ వంతు భాగంవున్నది.

— 1950 లో 1000 కంపెనీలకువున్న చెల్లించబడిన పెట్టుబడి రు 1000 కోట్లు; ఇది రు 2300 కోట్లకు పెరిగింది. పన్నులు చెల్లించక

ముందు వచ్చేలాభాలుకూడా వీటికి రు. 70 కోట్లనుండి ఏడాదికి రు. 200 కోట్లకు పెరిగినవి.

— ఆ విధంగా, కాంగ్రెసుపరిపాలనలో, అది అమలుజరిపే పంచవర్ష ప్రణాళికలకాలంలో, ఒకవైపున పెట్టుబడికేంద్రీకరణ, మరొక వైపున, పారిశ్రామికపెట్టుబడి, బ్యాంకింగుపెట్టుబడి పెనవేసుకొనిపోతూ వుండగా అతిత్వరగా అభివృద్ధి అవుతూవున్నది.

ఈ విధానాలన్నింటి మూలకంగానూ, బూర్జువావర్గం చేతులలో రాజ్యాధికారం వుండడం మూలకంగానూ మన ప్రభుత్వ పారిశ్రామిక రంగంలో గుత్తపెట్టుబడిదార్ల ప్రాబల్యం క్రమంగాపెరిగి, ప్రభుత్వ రంగాన్ని మరింతహెచ్చుగా వారిప్రయోజనాలను వుపయోగించుకొంటానికి దారితీసింది. ఫైనాన్షియల్ సంస్థలిచ్చే అప్పులలో అధికభాగం వారికిపోయి వారు మరింత బలపడటానికి వుపయోగపడింది. ప్రణాళికక్రింద యివ్వబడే పెద్దకంట్రాక్టులు అన్నీ, ఇతర పెద్దప్రభుత్వకాంట్రాక్టులన్నీ పెద్దపెట్టుబడిదార్లకే పోతున్నవి. అనేక ప్రభుత్వరంగం పరిశ్రమలు వుత్పత్తిచేసే సరుకుల అమ్మకంపైకూడా పెద్దపెట్టుబడిదార్లే కంట్రోలు చేస్తున్నారు. ప్రభుత్వపెట్టుబడిదారీ విధానానికే గుత్తపెట్టుబడిదార్లకూ మధ్య లింకులుపెరుగుతూవున్నా. చాలదన్నట్లు ప్రభుత్వపరిశ్రమలపెట్టుబడిలో భాగస్వాములుగా జేరమని ప్రభుత్వం పెట్టుబడిదార్లను ఆహ్వానిస్తోంది. పబ్లిక్‌రంగంయొక్క అభివృద్ధిని ఇది మరింత వికృత పరుస్తుంది. ఇంతేగాక, ప్రజాతంత్రవ్యతిరేక భావాలుకలిగినట్టీ, కార్మికవర్గానికి వ్యతిరేకభావాలు కలిగినట్టీ నిరంకుశోద్యోగుల పెత్తనంలో ఈ ప్రభుత్వ పరిశ్రమలు వుంచబడుతూవున్నవి. పబ్లిక్‌రంగంపై పెద్దపెట్టుబడిదార్ల పలుకుబడి పెరుగుతేనూ, నిరంకుశోద్యోగుల పెత్తనం పెరుగుతేనూ ప్రభుత్వపెట్టుబడిదారీవిధానం తన అభ్యుదయకాముక స్వభావాన్ని

కోల్పోయి, గుత్తపెట్టుబడిదార్ల చేతులలో ఒక ఆయుధంగా తయారౌతుంది.

(29) భారతప్రభుత్వం "పారిశ్రామిక విధాన తీర్మానా"న్ని ప్రకటించుకొంది. దీనిప్రకారం, భారీ మూలపరిశ్రమలన్నీ ప్రభుత్వరంగానికి ప్రత్యేకించి రిజర్వుచేయడం జరిగింది. కాని ఈ తీర్మానానికి విరుద్ధంగా, ఈ పరిశ్రమల్లో చాలాపరిశ్రమలు తాతా ఐరన్ అండ్ స్టీల్ లాంటివి ఇప్పటికే ప్రయివేట్‌రంగంలోవున్నాయి. తీర్మానానికి విరుద్ధంగా వాటిని పెద్దయెత్తున పెంచడానికి అనుమతించారు. ఈ పరిశ్రమల ఉత్పాదకశక్తిని భారీయెత్తున ద్రవ్య తదితర రకాల ప్రభుత్వసహాయంతో పెంచడానికి అనుమతించారు. ఈ పంచవర్ష ప్రణాళికలకాలంలో ప్రయివేట్ గుత్తపెట్టుబడి పెరుగుదలతో, విదేశీ గుత్తవర్గాలతో సంబంధాలు ఇంతకుముందెన్నడు లేనంతగా పెరుగుతుండడంతో,విదేశీ సహకారంతో ఈ కీలకపరిశ్రమల్లో అనేకమైనవాటిని నడపగలమనుకుంటున్నారు. అదే సమయంలో ప్రభుత్వం, తన పారిశ్రామిక విధాన తీర్మానం ఏ నిర్బంధాలనైతే విధించిందో వాటిని తొలగిస్తోంది; అల్యూమినియం, ఎరువుల పరిశ్రమలను, రసాయనపరిశ్రమలను, నూనెశుద్ధి కర్మాగారాలను తదితర పరిశ్రమలను నెలకొల్పుకోవడానికిగాను ప్రయివేట్ పెట్టుబడిదార్లకు లైసెన్సులను స్వేచ్ఛగా మంజూరుచేస్తోంది. స్వాతంత్ర్యసిద్ధి అనంతరం విపరీతంగా సంపద కొద్దిమందివద్దే కేంద్రీకరించబడేందుకు ఈ విధానాలే దారితీస్తున్నాయంటే ఆశ్చర్యంలేదు. ఇటీవల ప్రణాళికసంఘంవారు జరిపిన సర్వే ఒకవిషయాన్ని బయటపెట్టింది: మొత్తం జనాభాలో నూటికి 10 మందికి జాతీయాదాయంలో ¼ వంతులు లభిస్తోంది; కాగా, సమాజంలో అట్టడుగునవున్న మరో 10 మందికి మొత్తం జాతీయాదా

యంలో 2.5 శాతం మాత్రమే దక్కుతోంది. కాంగ్రెస్‌పాలకులు పదే పదే చెప్పే సోషలిస్టురాజ్య నిర్మాణమనే నినాదం నిజంగా ఎంత చోద్యంగావుంది!

(30) ఒకవైపున ప్రభుత్వం, ఇప్పటికే పాతుకుపోయిన బ్రిటిషు తదితర విదేశీద్రవ్య పెట్టుబడులవల్ల సాగుతున్న దోపిడీని నిర్మూలించ నిరాకరిస్తుంది; మరోవైపున ఆ పెట్టుబడులే కొత్తగా పెద్ద మొత్తున దేశంలోకిచొచ్చుకువచ్చేందుకు ఉదారంగా సౌకర్యాలూ, హామీలూ, కొత్తకొత్త అవకాశాలూ కల్పిస్తోంది.

స్వయంపోషక ఆర్థికవిధానం అనబడే దానిని నిర్మించటమనే పేరుతోనూ, తమవిధానాల ఫలితంగానే ఏర్పడిన విదేశీమారక ద్రవ్యం లోటును పూడ్చుకోవటం అనేపేరుతోనూ కాంగ్రెసుపాలకులు బ్రిటిషు, అమెరికన్, పశ్చిమజర్మనీ, తదితర పాశ్చాత్యదేశాల గుత్తపెట్టుబడిదార్లను మనదేశానికి రమ్మనమని, పెట్టుబడులను పెట్టమని, నమ్మకంగా విపరీతలాభాలను సంపాదించుకొమ్మనీ ఆహ్వానిస్తున్నారు.

ఫలితంగా, 1948 లో రు 256 కోట్లుగావున్న విదేశీ ప్రైవేటు పెట్టుబడులు 1962 నాటికి రు 830 కోట్లకు పెరిగినవి; అంటే మూడు రెట్లు అయినవి. బ్రిటిషుపెట్టుబడులు ఈకాలంలో రు 206 కోట్లనుండి రు 416 కోట్లకు పెరగగా, అనగా, రెట్టింపుకాగా, అమెరికన్ పెట్టుబడులు రు 11 కోట్లనుండి రు 191 కోట్లకు పెరిగినవి; అనగా 11 రెట్లు పెరిగినవి. కొన్ని కీలకపారిశ్రామిక రంగాలలో అమెరికన్‌పెట్టుబడిపెరిగే విపరీతవైఖరిని చూస్తే మనదేశపు ఆర్థికజీవితానికి, దానిఫలితంగా మన రాజకీయజీవితానికి అమెరికన్‌పెట్టుబడి ప్రవేశంయొక్క పెరిగే ప్రమాదాన్ని స్పష్టంగా గుర్తించవచ్చును. విదేశీ ప్రైవేటుపెట్టుబడి ఈవిధంగా

దేశంలోకి చొచ్చుకురావటాన్నీ, భారతదేశపు బడాపెట్టుబడిదార్లతో అవి చేతులుకలుపుతూవుండటాన్నీ ప్రభుత్వం బహిరంగంగా ప్రోత్సహిస్తోంది: బలపరుస్తోంది. ప్రైవేటురంగంలో ఇటువంటి జాయింటు ఒడంబడికలు 1958 కి పూర్వం 71 మాత్రమే వుండేవి; కాని ఇవి 1962 నాటికి 1442 అయినవి. ఈరోజున పరిస్థితులు ఎంతవరకు వచ్చినవంటే, విదేశీపెట్టు బడితో జాయింటుపున్నదని ముందుగా రుజువులు చూపితేనేగాని కొత్త పరిశ్రమలకు లైసెన్సులు దొరకడం అతి దుర్లభంగా వున్నది.

(31) భారతగుత్తవర్గాల పెరుగుదలతోపాటు పెద్దపెట్టున బ్రిటిషు, అమెరికన్, తదితర విదేశీసామ్రాజ్యవాద పెట్టుబడులు దేశంలోకి చొచ్చుకు రావడంకూడా ఎంతగా పెరిగిందో ఈ సందర్భంలో తెలుసుకోవడం ఆసక్తిదాయకంగా వుంటుంది. ఇప్పటికి మనకు స్వాతంత్ర్యం వచ్చి 17 సంవత్సరాలు గడిచాయి; మూడు పంచవర్షప్రణాళికలు వేసుకొన్నాం: సాధ్యమైనంతవరకూ సోషలిస్టుదేశాలు అందించిన నిస్వార్థసహాయంతో ప్రభుత్వరంగంలో కీలకపరిశ్రమలు నిర్మించుకొంటున్నాం _ కాని ఈ అవకాశాలన్నింటినీ కాంగ్రెస్‌ప్రభుత్వం దేశంలో విదేశీ సామ్రాజ్యవాద పెట్టుబడులను సమూలంగా అదుపులోపెట్టి, అవి మన జాతీయసంపదను దోచుకోకుండా శాశ్వతంగా తొలగించేందుకు వినియోగించుకోలేదు. విశ్వసనీయమైన అంచనాలనుబట్టి, 1950_51 లో భారతదేశంలో పెట్టిన మొత్తం ప్రయివేట్ పెట్టుబడులు రు 900 కోట్లుండగా, అదేసంవత్సరంలో విదేశీ ప్రయివేట్ పెట్టుబడులు రు. 300 కోట్లుందని తేలింది. 1962 సంవత్సరం ఆఖరికిచూస్తే దేశంలోని ప్రయివేట్ పెట్టుబడుల మొత్తం రు. 900 కోట్లనుండి రు. 2,500 కోట్లకు పెరిగాయని, బ్రిటిషు, అమెరికన్, తదితర విదేశీ ప్రయివేట్ పెట్టుబడులు రు. 830 కోట్లకు పెరిగాయని తేలింది. ఈ విధంగా 1950_51 నాటికి అంటే ప్రథమ

పంచవర్ష ప్రణాళికా ప్రారంభంనాటికి దేశంలో మొత్తం ప్రయివేట్ పెట్టుబడులలో విదేశీ పెట్టుబడులభాగం 33.3 శాతంవుంటే, అది 1962 సంవత్సరంనాటికి దాదాపు అదేశాతం—33.2 శాతం—కొనసాగుతూ వచ్చింది.

**(32)** విదేశీ ప్రయివేట్ పెట్టుబడులయొక్క ఈ ఉపద్రవకర పెరుగుదల మన ఆర్థిక, రాజకీయ, సాంఘిక జీవనంపై అనేక దుష్ఫలితాల్ని కల్గిస్తుంది. ఈ పెరుగుదల మొత్తం మన ఆర్థికాభివృద్ధినే కుంటుపరుస్తుంది. ఆ కొద్దీ భారత బడావ్యాపారవర్గాలు విదేశీపెట్టుబడిదార్లతో కలసి [కొలాబరేషన్] వందలాది ఒప్పందాలు కుదుర్చుకొన్నాయి; వీటి వెంటనే, లోపాయకారిగానూ, బాహాటంగానూ విధించిన అనేకరకాల షరతులున్నాయి. ఇవి మనదేశ భవిష్యత్తుకు తీవ్రప్రమాదాన్ని తెచ్చిపెట్టాయి.

**(33)** విదేశీ పెట్టుబడులు ప్రభుత్వంలోనూ, ప్రభుత్వరంగంలోనూ ఎంతపెద్దఎత్తున పట్టుసంపాదిస్తున్నాయో గణనలోకితీసుకోకపోతే ఈ విదేశీ పెట్టుబడిదోపిడీ దిగుమతి తీవ్రతనూ, మనజాతీయ జీవితంలో దానిపాత్రనూ అవగతం చేసుకోలేం. సహాయంపేరుతో మనదేశంలోకి బ్రిటన్, అమెరికా, పశ్చిమజర్మనీ, తదితర పెట్టుబడిదారీ పశ్చిమరాజ్యాల నుంచి పెద్దమొత్తాలలో పెట్టుబడులు దిగుమతవుతున్నాయి. మనదేశం లాంటి బడుగుదేశానికి సామ్రాజ్యవాద 'సహాయం' యొక్క సారమేమిటో ప్రతివారికీ తెలుసు. 1962 సంవత్సరాంతంవరకూ భారత ప్రభుత్వం సామ్రాజ్యవాదులనుంచి వినియోగించుకొన్న మొత్తం సహాయం రు. 2,220 కోట్లు [రు. 320 కోట్ల ప్రీగ్రాంట్లతోసహా] కాగా సామ్రాజ్యవాదరాజ్యాలు యిస్తానని హామీ యిచ్చిన సహాయం మొత్తం రు. 3,435 కోట్లు. ఈ సందర్భంలో ఒకవిషయాన్ని గమనించాలి: ఇదే

కాలంలో భారతప్రభుత్వం, సోషలిస్టుదేశాలు యిస్తాననిచెప్పిన మొత్తం రు. 455 కోట్లలోనూ రు. 125 కోట్లనుమాత్రమే వినియోగించుకొంది. పెద్దపెద్ద మొత్తంలో విదేశీ గుత్తపెట్టుబడిదారీ సహాయం వస్తూండడం వల్ల దానివల్ల మన సాంఘిక, రాజకీయ జీవితంపై ఇతరత్రా అనేక దుష్ఫలితాలతోపాటు, చాలకాలంవరకూ ఒక్క అప్పులుచెల్లించడానికే ఏటా మనదేశం రు. 100 కోట్లు చెల్లిస్తూండాలి.

(34) ఈవిధంగా, ప్రభుత్వ బడాబూర్జువావర్గ నాయకత్వం తన పంచవర్ష ప్రణాళికలతో ప్రారంభించిన పెట్టుబడిదారీ పారిశ్రామికీకరణా, ప్రభుత్వరంగనిర్మాణమూ భారత బడావ్యాపారవర్గ అభివృద్ధికీ, దానితో పాటు భారతదేశంలో చౌకగాలభించే శ్రమశక్తినీ తదితర జాతీయసంపదనూ దోపిడీచేయడంద్వారా విదేశీ గుత్తపెట్టుబడిదారులు దేశాన్ని మరింత కొల్లగొట్టుకోడానికీ మార్గాన్ని సుగమం చేస్తోంది. సంవత్సరం సంవత్సరానికీ, లాభాలరూపంలోనూ, డివిడెంట్లరూపంలోనూ, వడ్డీల రూపేణా, జీతాలూ ఎలవెన్సులరూపంలో, కమిషన్లరూపంలో భీమా తదితర రవాణా ఛార్జీలరూపంలో, యింకా యితరత్రా కనిపించీ-కనిపించని మార్గాలద్వారాను మనదేశంనుండి అనేకకోట్ల రూపాయలను తరలించుకుపోతున్నారు. మన జాతీయప్రయోజనాలతో ఈ దోపిడీదార్లకు ఎట్టి ప్రమేయమూలేదు. మన వనర్లను దారుణంగా దోచుకోవడమొక్కటే వీరి ఏకైకదృష్టి. వీరు పబ్లిక్ జీవితరంగంలో భారత బడాపెట్టుబడిదార్ల పెరగటానికీ, ఇతర అభివృద్ధినిరోధకశక్తులు పెరగటానికీ సహాయకారులుగా వుంటారు. మన ఆర్థికరంగాన్ని దాహాటంగానూ, లోపాయికారిగానూ చెబ్బతీస్తుంటారు: మన ఆర్థికాభివృద్ధి రేటును వక్రమార్గంపట్టించి కుంటుపరచడానికి ప్రయత్నిస్తారు. జాతీయవ్యతిరేక కుట్రలకూ, కూహకాలకూ ఈ సామ్రాజ్యవాద విదేశీపెట్టుబడి ఒక ప్రమాదకరమైన ఆధారం. అందుకనే దీనిపాత్ర జాతీయప్రయోజనాలకే విరుద్ధం.

(35) ప్రపంచమందలి సామ్రాజ్యదేశాలలోకెల్లా మిక్కిలి భాగ్యసంపన్నమైన అమెరికా బ్రహ్మాండమైన అంతర్జాతీయ దోపిడిదారుగా తయారైంది: ఇది ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల సంపదలనన్నిటినీ కొల్లగొడుతూవున్నది. ప్రధానంగా మిలిటరీకూటముల నేర్పర్చడం, ఆర్థిక 'సహాయాన్ని' అందించడం అనే పాలసీద్వారా అమెరికన్ సామ్రాజ్యవాదులు అనేకదేశాలను తమ కంట్రోలుక్రిందకు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. బడుగుదేశాలపై ఒత్తిడితెస్తానికీ, ఆ దేశాలను తాము ఆర్థికంగా దోచుకొంటానికీ, వాటిని తన రాజకీయ పెత్తనంక్రింద నిల్పుకొంటానికి ఇటువంటి 'సహాయాన్ని' వుపయోగిస్తున్నారు; ఆ విధంగా వారు నయావలసవిధానంయొక్క ప్రధానమైన బురుజుగా వుంటున్నారు. వారీ దేశాలను మిలిటరీ కూటములలో చిక్కుపడజేయాలనీ, లేదా ప్రచ్ఛన్నయుద్ధం రాజకీయాలలోకి ఈడ్వాలనీ ప్రయత్నిస్తున్నారు. ప్రపంచ అభివృద్ధినిరోధకశక్తులకు అమెరికన్ సామ్రాజ్యవాదం నేడు ప్రధానమైన బురుజుగా వుంటున్నదనీ, అంతర్జాతీయ రక్షకభటుడుగా వుంటున్నదనీ, యావత్ప్రపంచప్రజలకు ప్రధానశత్రువు అయిందనీ ఇటీవలజరిపిన అనేక అంతర్జాతీయఘటనలు మరొకసారి రుజువుపర్చాయి.

ఇటువంటి పరిస్థితులలో, మనదేశంలోనికి అమెరికన్ పెట్టుబడులు చొరుచుకువస్తూవుండడంవల్ల, మనం అంతకంతకూ హెచ్చుగా అమెరికన్ 'సహాయం'పై ఆధారపడుతూవుండడంవల్లా మనదేశానికికూడా ఒక ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడుచున్నది. దీని నుపయోగించుకొని అమెరికన్ సామ్రాజ్యవాదులు మనదేశాన్ని దోచుకొంటానికై మరిన్ని ఎక్కువసదుపాయాలు కోరుచున్నారు: భారతీయ బడాపెట్టుబడిదార్లతో చేతులు కల్పటానికి చూస్తున్నారు: కాశ్మీరుసమస్యలో రుజువైనట్టుగా మనదేశంపై రాజకీయపుటొత్తిడిని తీసుకువస్తున్నారు. సాంఘిక,

సాంస్కృతిక, విద్యా రంగాలతోసహా మన దేశ జీవితంలోని అన్ని రంగాల లోనూ వారు చొరబడుతున్నారు. మన దేశంలోని వివిధ అభివృద్ధినిరోధక శక్తులతో వారు ప్రత్యక్షసంబంధాలను పెట్టుకొంటున్నారు. మన దేశంలో సామ్రాజ్యవాదపు కుళ్ళుసంస్కృతిని వెదజల్లడంద్వారా వెల్లడియైనట్లు వారు మన సాంఘిక, సాంస్కృతికజీవనాన్ని చెరచటానికి ప్రయత్నిస్తున్నారు. ఇవన్నీకూడా మన సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవితానికి పెద్దప్రమాదాన్ని కల్గజేస్తున్నవి.

(36) ఈ విదేశీ పెట్టుబడి ప్రస్తుతపట్టులోనే వున్నంతకాలమూ, భారతదేశంలో ప్రవేశించడానికి ముగుదాళ్ళువేయని ఈ గుత్తపెట్టుబడి దిగుమతికి ద్వారాలు బాహాటంగా తెరచివుంచినంతకాలమూ, మనదేశం తన ఆర్థికపరాధీనతను అధిగమించనూలేదు; తన బహుముఖ పురోగతిని సంరక్షించుకోనూలేదు. అలాగే సామ్రాజ్యవాదుల వత్తిడినుండీ, జోక్యం నుంచీ, బెదరింపులనుండీ మనదేశం తన రాజకీయజీవితాన్ని రక్షించుకోనూలేదు. భారత స్వతంత్ర విదేశాంగ, శాంతి, తటస్థవిధానంపైన విదేశీ సామ్రాజ్యవాదులూ దేశంలోని అభివృద్ధి నిరోధక వర్గాలూ పదే పదే ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ తీసుకొచ్చిన ఒత్తిడి ఎలాంటిదో, ఇన్నిసంవత్సరాలుగా ఈ విదేశాంగవిధానం ఎట్టి క్లిష్టమార్గాన పయనిస్తు వస్తున్నదో దీన్ని అధ్యయనంచేసిన వారందరికీ స్పష్టమవుతుంది.

# V

# వ్యవసాయ సంస్కరణాలు

(37) ఈ బూర్జువావర్గ-భూస్వామ్య ప్రభుత్వవిధానాలు పూర్తి వైఫల్యం వ్యవసాయ సమస్యలో బహిర్గతమైనంత నగ్నంగా మరో రంగంలో బహిర్గతం కాలేదు. ఈ ప్రభుత్వ వ్యవసాయవిధానాల ఉద్దే

శమూ, నడకా, మన భూ సంబంధాలపై ఫ్యూడల్-అర్ధఫ్యూడల్ బంధ నాలను తెగ్గొట్టి రైతాంగాన్ని శతాబ్దాల సంకెళ్ళనుంచి విముక్తిచేయడం ఎంతమాత్రమూ కాదనీ, ఫ్యూడల్ భూస్వాములను పెట్టుబడిదారీ భూస్వాములుగా మార్చడమూ, ధనిక రైతువర్గాన్ని సృష్టించడమే ఈ ప్రభుత్వవిధానాల ఉద్దేశమని ఈ 17 సంవత్సరాల కాంగ్రెస్ పరిపాలన ఎట్టి అనుమానానికి తావులేకుండా నిరూపించింది. పెట్టుబడిదారీ అభివృద్ధి అవసరాలను ఆదుకొనేందుకు అవసరమైన అదనపు వ్యవసాయోత్పత్తిని సృష్టించిపెట్టేందుకు ఈ ధనిక రైతాంగంపై ఆధారపడవచ్చు; ఈ వర్గమే గ్రామీణప్రాంతాల్లో పాలకవర్గపార్టీకి ప్రధానరాజకీయ పునాదిగా వుండ గల్గుతుంది. ఇదే ప్రభుత్వ వ్యవసాయవిధానాల ఉద్దేశం.

(38) సంస్థానాధీశుల ఫ్యూడల్సంస్థానాల రద్దుచేశారు. అయితే మాజీసంస్థానాధీశులకు, వారి కుటుంబాలకూ అనేకకోట్లరూపాయలమేరకు పెద్దయెత్తున రాజభరణాలను [ప్రీవీపర్సులు] ఇస్తామన్న హామీతో వాటని రద్దుచేశారు. దీనికితోడు ఈ సంస్థానాధీశులచేతుల్లో, వాళ్ళు కొల్లగొట్టిన సంపదనంతనూ వుంచారు; విశాలమైన వ్యవసాయ, అటవీభూముల్ని అట్టేపెట్టారు. జమీందారీలు, జాగీర్దారీలు, ఈనాందారీల్లాంటి మధ్యదళారీలనురద్దుచేయడానికై తీసుకొన్నచట్టచర్యలు,ఈ దళారీలు కీరీ, ఖుద్ కాష్త్ లేదాపన్నాయ్ భూములపేరుతో పెద్దపెద్దభూములున్న ఎస్టేట్లను వుంచుకోడానికి బుద్ధిపూర్వకంగానే అవకాశం కల్పించాయి; వారికి పెద్దపెద్ద మొత్తాలలో నష్టపరిహారం చెల్లిస్తామని గ్యారంటీ యిచ్చాయి. ఈ మధ్యదళారీ హక్కుల రద్దుఅనంతరం వెంటనే దున్నేవారికే స్వేచ్ఛగా యాజమాన్యపు హక్కును దఖలుపర్చడం జరగలేదు. పైగా, చట్టాలు అవకాశం చేసుకొనీ, చట్టవిరుద్ధంగాకూడా లక్షలాది కౌల్దార్లు భూముల నుండి అకస్మాత్తుగా బేదఖల్ చేయబడ్డారు లేదా కౌల్దార్లు భూస్వాములకు సరసంగాని ధరలు చెల్లించి భూమిహక్కును కొనుక్కోక తప్పని

వత్తికిస్థితి కల్పించారు. ఈ విధంగా ఏటా మాజీసంస్థానాధీశులకు రాజభరణాలరూపంలో కోట్లరూపాయలు చెల్లిస్తుండడంవల్లా, వాయిదాలరూపంలో మధ్యదళారీలకు రు.600కోట్లు నష్టపరిహారంగా చెల్లించినందువల్లా, భూమిహక్కులు వగైరా అమ్మడంద్వారా బడాభూస్వాములు రైతాంగంనుంచి పెద్దపెద్ద మొత్తాలలో డబ్బుపిండుకోవడంవల్లా, వ్యవసాయోత్పత్తికి ఎంతో అవసరమైన పెట్టుబడి వ్యవసాయరంగానికి లేకుండాపోయింది. ఈ విధంగా వ్యవసాయం ప్రభుత్వంపై ఒకభారంగా తయారైకూర్చుంది; ఇక ఈ పరిస్థితివల్ల లాభించుకున్నదల్లా ఉత్పత్తిలో వాస్తవికంగా పాల్గొనని ధనిక భూస్వాములకే.

(3) రైతువారీ ప్రాంతాలలో ప్యాసుచేయబడ్డ కవులువారీచట్టాలు, స్వంతసాగులనే పేరుతో, సాగుజేసే కౌలుదార్లనుండి భూమిని తిరిగి స్వాధీనంచేసుకొనే హక్కును కల్పిస్తున్నది. ఈవిధంగా, ఏదో ఒక సాకుతో కౌలుదార్ల న్యాయమైన కౌలుహక్కులు పరిహరింపబడుతూ వుండడంవల్ల, అసలే అన్యాయంగా నిర్ణయింపబడిన 'న్యాయమైన' కౌలు రేట్లు అనబడేవాటికి ప్రాముఖ్యతలేకుండానే పోతున్నది. ఒకవైపున, బుద్ధిపూర్వకంగానే చట్టాలలో అనేక లొసుగులు వున్నందువల్లా, మరొకవైపున, భూస్వామికవర్గాలనుండే ఎక్కువగావచ్చిన అధికార బృందంచే ఈ చట్టాలు అమలు జరపబడవలసివున్నందునా, ఆచరణలో అనేకవేల, లక్షల కౌలుదార్లు భూములనుండి వెళ్ళగొట్టబడినవారై, లోగడనే అధికసంఖ్యాకంగావున్న దివాళారైతులు, వ్యవసాయకూలీల జనాభాలో జేరిపోతున్నారు.

(4) ఇక అద్భుతంగా చెప్పబడే 'కమతాలసీలింగు చట్టాల' విషయంచూస్తే పెద్దభూస్వాములు తమ భూములను పూర్తిగా ఏదో ఒక

రూపంలో అట్టేపెట్టుకొనివుంచే విధంగానూ, లేదా, తన కుటుంబసభ్యుల మధ్య పంపకం చేసినట్లుగా నాటకమాడి సీలింగు తమకు వర్తించనట్లుగా చేసుకొనే విధంగానూ ఈ చట్టాలు చేయబడినవి. చాలా సందర్భాలలో సీలింగు చాలా హెచ్చుప్రమాణంలో పెట్టబడింది. దీనికితోడు 'తోట భూములు' 'పచ్చికబీళ్ళు' 'సమర్థవంతంగా నిర్వహింపబడే క్షేత్రాలు' మున్నగువాటిని సీలింగునుండి మినహాయించడంద్వారా సీలింగుచట్టాలకే అతుకుజారిపోయింది. కాబట్టి ఈ చట్టాలు కాగితాలపైననే వుండిపోయినవి. లేదా, కష్టజీవి రైతాంగానికి పంచటానికై ఏమాత్రమూ చాలనటువంటి అతిస్వల్పమైన భూమి మాత్రమే స్వాధీనం చేసుకోబడింది అనటంలో ఆశ్చర్యమేమీలేదు.

(41) వ్యవసాయోత్పత్తిని పెంచటానికి ఒక మార్గంగా కాంగ్రెసు పరిపాలకులు కమతాల ఏకీకరణ మార్గాన్ని ఒకదానిని చేబట్టారు. ఇది కూడా కొన్నిరాష్ట్రాలలోనే సాగించారు. అమలుజరిపినచోటనల్లా ప్రధాన భాగాలన్నీ భూకామందులలో పైతరగతులవారికే ముట్టాయి. పేద, మధ్య తరగతి రైతాంగానికివుండే మంచిభూములు, మంచిస్థలాలు తమకు వచ్చేటట్లుగా ఈ పైతరగతులవారు ఈ భూముల ఏకీకరణను వుపయోగించుకున్నారు.

(42) భూస్వాముల భూములను స్వాధీనంచేసుకొని దున్నేవారికే భూములు పంచిపెట్టటం సంగతి లేకపోగా, కనీసం ప్రభుత్వంస్వాధీనంలో వున్న బంజరుభూములలో అత్యధికభాగాన్ని పంచటాన్నికూడా కాంగ్రెసు ప్రభుత్వాలు ఏదో ఒక నెపంతో దాటవేస్తూవున్నది. అనేకరాష్ట్రాలలో సాగుకు లాయకీఅయిన లక్షలకొలది ఎకరాల బంజరుభూమివున్నది. కాని దీనిలో కూడా చాలాభూమిని పలుకుబడిగల భూస్వాములు ఆక్రమించుకొని అర్హులైన రైతులు దీనిని సాగుచేసుకోకుండా అడ్డుపడుచున్నారు. బంజ

ర్లనబడే ఈ భూములను ఎక్కడనైనా పేదరైతులు సాగుచేసుకొంటూ వాటిని అంటిపెట్టుకొని వుంటుంటే వాటిపై ప్రతిఏటా విపరీతమైన పెనాల్టీలు ప్రభుత్వం వేస్తున్నది. అనేకరాష్ట్రాలలో సామాన్యమైన రైతులు ప్రాజెక్టులు, పరిశ్రమలు నిర్మించబడే ప్రాంతాలనుండి వెళ్ళగొట్టబడ్డారు; వారికి వేరే భూమి చూపబడలేదు. ఆవిధంగా వీరు వ్యవసాయకూలీ జనాభాలో చేరవలసినవారౌతున్నారు.

(43) అసలే భూమిలేనటువంటి, లేదా, చాలా స్వల్పమైన పీలికలు కలిగినటువంటి వ్యవసాయకార్మికులు, తమ శ్రమశక్తిని అమ్ముకొని జీవించే వ్యవసాయకార్మికులు మన గ్రామీణజనాభాలోకెల్లా పెద్దభాగంగా వున్నారు. ప్రభుత్వవ్యావసాయికవిధానాలూ, తరతరవిధానాల ఫలితంగానూ అని భూములనుండి తొలగించబడ్డ కౌలుదార్లవల్లనూ, దివాలాతీసిన రైతాంగంవల్లనూ, వృత్తులు పోగొట్టుకొన్న చేతివృత్తులవారివల్లనూ ఈ వ్యవసాయ కార్మిక జనాభా పెరుగుతూవున్నది. భారతదేశం మొత్తం మీద వీరిసంఖ్య మొత్తం గ్రామీణవ్యవసాయదార్ల జనాభాతో పోలిస్తే 30-35% వుంటున్నది. ఆంధ్ర, తమిళనాడు, కేరళ, మైసూరు, ఒరిస్సా, బీహారులలో 50-55% వరకూ వుంటున్నది. వీరిలో వేలకొలది భూస్వాములవద్ద ధనిక రైతులవద్దా ఏడాదిపొడుగునా పాలేళ్ళుగా పని చేస్తూవుంటున్నారు. వీరికి కనీసపువేతనాలను నిర్ణయిస్తామనీ, ఇతర హక్కులు కలగజేస్తామనీ కేంద్రప్రభుత్వం 1948నుండి ఉపన్యసిస్తున్నా, వీరిజీవన పరిస్థితులను అభివృద్ధి పరచడానికిగానీ, భూస్వాముల దోపిడి నుండి వీరినితప్పించడానికిగానీ ఆచరణలో ప్రభుత్వంచేసిన చెప్పుకోదగ్గ పనేమీలేదు. అనేకసంవత్సరాలు వాగ్దానాలు చేసి చేసి చివరకు పాసు జేసిన కనీసవేతనాలచట్టం అలంకారానికేగాని మరేమీకాదు. ఈ చట్టాల ప్రకారం నిర్ణయింపబడిన వేతనాలుగాని, ఇతర పనిసౌకర్యాలుగాని ఇవ్వ

డున్న వేతనాలరేట్లకన్న తక్కువైనావున్నవి; లేక, హెచ్చురేట్లు నిర్ణయించినా అవి అమలులోకి రాకుండాపోయినవి. అత్యధిక సంఖ్యాకులైన వ్యవసాయకార్మికులకు ఉంటానికి ఇల్లూలేదు, గుడిసెవేసుకొంటానికి స్థలమూలేదు. ఏడాదిలో ఆరునెలలు వారికి అసలుపనేమీదొరకదు. దొరికినా చేతినిండా పనిదొరకదు. అనేక ప్రభుత్వ 'నివేదికలూ' ప్రభుత్వేతర నివేదికలూ ఈ వ్యవసాయకార్మికుల నిజవేతనాలు పడిపోతున్నవనీ, పనిరోజులు తగ్గిపోతున్నవనీ.అప్పులు పెరిగిపోతున్నవనీతెలియజేస్తున్నాయి. వీరి జీవనపరిస్థితులలో తీవ్రమైనమార్పులు లేకుండా హీనస్థితిలోవున్న మన గ్రామీణ జీవితాన్ని అభివృద్ధిచేయడంగాని, వ్యావసాయికరంగంలో ఉత్పత్తిశక్తులను వాటిబంధనాలనుంచి తొలగించడంగాని సాధ్యంకాదు.

(44) ప్రభుత్వం ప్రారంభించిన సామాజికాభివృద్ధి పథకాలూ, పంచాయితీరాజ్య పథకమూ చిట్టచివరకు, గ్రామీణసీమలలో పరిపాలక వర్గంయొక్క ధనికరైతు, భూస్వామిపునాదులను విస్తృతపర్చి బలపర్చటానికి మార్గాలుమినహా మరేమీకావు. తనవర్గపాలసీలకు అనుగుణ్యంగానే ప్రభుత్వం, వ్యవసాయదారులలో ఇతరులకు దాదాపు మొండిచేయి చూపుతూ, రైతాంగంలోని ధనికవర్గాలకే అప్పులు, సబ్సిడీలు యివ్వడంగాని, టెక్నికల్ తదితరసహాయాలు యివ్వటంగాని సాగిస్తున్నది. సామాజికాభివృద్ధి పథకాలద్వారానూ, జాతీయ విస్తరణాభివృద్ధిపథకాలద్వారానూ, ఖర్చుచేయబడేడబ్బులో అధికభాగం, భూస్వాములు, ధనికరైతుల జేబులలోనికిపోతున్నది. తక్కావీ అప్పులరూపంలో పెద్ద మొత్తాలు వారికందియబడుచున్నవి. ట్రాక్టర్లు, పంపుసెట్లు, ఆయిల్ ఇంజన్లు కొనుక్కొంటానికి, గొట్టపుబావులను తవ్వుకొంటానికి వారికి ప్రత్యేక వ్యావసాయికఋణాలు ఇవ్వబడుతూవున్నవి. ప్రభుత్వం అందించే రసాయనికఎరువులలోనూ, మేలిరకం విత్తనాలలోనూ అత్యధికభాగంకూడా వీరికే ముట్టుచున్నది.

(45) ధనస్వామ్యపు ఆర్థికవిధానం గ్రామసీమలన్నిటినీ పూర్తిగా పెనవేసుకొనటంతో సట్టావ్యాపారం, 'ధాన్యాన్ని నిల్వపోతలు పోయటం లాంటివి విపరీతంగా పెరిగిపోయినవి. బ్యాంకులు విరివిగా అప్పులివ్వటం ద్వారానూ, ఇతరవిధాలా ఈ సట్టా వ్యాపారం సాగుతోంది. మన వ్యవసాయికోత్పత్తిపై స్వదేశీ విదేశీ గుత్తవ్యాపారస్థులపట్టు చాలా వేగంగాపెరిగింది. దానిఫలితంగా, వ్యవసాయకోత్పత్తికి ధరలు తక్కువగావుంటే పారిశ్రామికవస్తువులకు ధరలు హెచ్చుగా వుండటం అనే రూపంలో అసమాన వినిమయం, ధరలు విపరీతమైన ఒడుదుడుకులకు లోనవుతూవుండటంద్వారా రైతాంగంపై సాగే దోపిడి మరింత తీవ్రమౌతోంది. ఫలితంగా, రైతు తనపంటలను అమ్ముకునేవాడుగానూ దోచుకోబడుతూ వున్నాడు; పారిశ్రామికవస్తువుల కొనుగోలుదారుగానూ దోచుకోబడుతూ వున్నాడు.

(46) వీటన్నిటి ఫలితంగా వడ్డీవ్యాపారం బాగాపెరిగింది. రిజర్వు బ్యాంకు జరిపిన రూరల్ క్రెడిట్ సర్వేప్రకారం 1956 లో రు. 900 కోట్లుగావున్న గ్రామీణ రుణభారం తర్వాత పెరుగుతూనేవున్నది. ఎంత తక్కువగా అంచనావేసినా ఈ రుణాలమీద ఏటా రు. 100 కోట్లకు తగ్గకుండా వడ్డీ పెరుగుతున్నది. అదేసమయంలో, మామూలు వ్యవసాయపనులకుకూడా రైతులకు మామూలువడ్డీకి పరపతిదొరకటం దుర్లభమైపోతున్నది. బ్యాంకులద్వారా సహకారసంఘాలద్వారా, ప్రభుత్వం ఇచ్చే రుణాలద్వారా ముట్టేదంతాకూడా కలిపినా రైతుల పరపతి అవసరాలలో అత్యల్పభాగమే దొరుకుతున్నది. ఆ దొరికేదానిలోకూడా ఎక్కువభాగం భూస్వాములూ, ధనికరైతులకూ పోతున్నది. పరపతిదొరకటం దుర్లభమౌతున్నందున వ్యవసాయోత్పత్తి క్షీణించటమేకాదు; భూమికూడా పేదరైతుల చేతులలోనుండి జారిపోతున్నది. గ్రామీణ రుణభారాన్ని తగ్గించడానికి ప్రభుత్వం ససేమిరా వీలులేదంటున్నది.

(47) దీర్ఘకాలింగావస్తున్న వ్యావసాయిక సంక్షోభాన్ని పరిష్కరించలేకపోవటంలోనే ఈ వ్యావసాయిక విధానాల దివాళాకోరుతనం బైటపడుతూవున్నది. వేలకోట్లరూపాయిలు వ్యవసాయంపేరుతో, నీటి పథకాలపేరుతో, ఎరువులపేరుతో ఖర్చుచేసినా వ్యవసాయోత్పత్తిలో సాధించిన అభివృద్ధి ఏమాత్రం చాలదు సరిగదా, గతమూడేండ్లలోనూ ఈ అభివృద్ధికూడా గొర్రె తోకవలె పెరగకుండా నిల్చిపోయి వున్నది. ఫలితంగా, పి. యల్. 480 క్రింద మనదేశం ప్రతిఏటా అమెరికానుండి విపరీతంగా ఆహారధాన్యాలనూ, ముడిసరుకులనూ దిగుమతిచేసుకొంటూ వున్నది. కాంగ్రెసు ప్రభుత్వ పరిపాలనాకాలంలో ఇంతవరకూ రు. 1800 కోట్లకుపైగా మనం ధాన్యాలను దిగుమతి చేసుకొన్నాము.

(48) స్వాతంత్ర్యంవచ్చి దాదాపు రెండుదశాబ్దాలు గడుస్తున్నా, ఈకాలమంతా కాంగ్రెస్ పరిపాలన చేస్తూవున్నా, అనేక వ్యవసాయిక చట్టాలు చేసినా, భూమికేంద్రీకరణమాత్రం యథాతథంగానేవున్నది. గ్రామసీమలలోనివసించేకుటుంబాలలో ఉన్నతవర్గాలకుచెందిన 5%కుటుంబాలచేతిలో 37.24%భూమివుంటే70%కుటుంబాలచేతులలో20%భూమికన్న ఎక్కువలేదు. కోటానుకోట్లుగావున్న రైతులయొక్క శ్రామికోత్సాహమూ, నిర్మాణశక్తి పెంపొందాలంటే మొట్టమొదటగా ఈ భూమిపై వున్న గుత్తాధికారం బద్దలుకొట్టబడాలి; వ్యవసాయకార్మికులకూ, పేద రైతులకూ భూమి వుచితంగా పంచిపెట్టబడాలి; కృంగదీస్తున్న రుణ భారాన్ని తొలగించాలి; ఇవే వ్యవసాయోత్పత్తి బ్రహ్మాండంగా పెరగటానికి పునాదిగా వుంటాయి. మరొకవిషయమేమిటంటే, ప్రస్తుతంవున్న వ్యవసాయసంబంధాల ఫలితంగా ఏటా దాదాపు రు. 1000 కోట్లు కౌళ్ళ రూపంలోనూ, వడ్డీరూపంలోనూ భూస్వాముల చేతులలోకి, వడ్డీవ్యాపారస్తుల చేతులలోకి పోతున్నవి. ఈ ధనం ఉత్పత్తిని పెంచటానికిగాక చట్టావ్యాపారాన్ని సాగించటానికి,అధికవడ్డీలకు,రుణాలివ్వటానికిమాత్రమే

ఉపయోగింపబడుతూవున్నది. కాబట్టి, ఈ వ్యవసాయిక సంబంధాలను రద్దుచేయడంద్వారా మన పరిశ్రమలనూ, వ్యవసాయానికి కావలసిన పెట్టుబడిని సమకూర్చడానికి ఒక ప్రధానమైన వసరు ఏర్పడుతుంది.

# VI

# ప్రజల పరిస్థితులు

(49) ఉత్పత్తిపెరిగినా ప్రజల పరిస్థితులలో భౌతికంగా మార్పేమీరాలేదు; ఎందువల్లనంటే పెరుగుచున్నసంపద దోపిడివర్గాల చేతులలోనే కేంద్రీకరింపబడుతూ వున్నది. ప్రభుత్వంయొక్క విధానాల యెడల, గుత్తసంస్థల పెత్తనం పెరుగుతూవుండటంయెడలా కార్మికులూ, రైతులూ, మధ్యతరగతి ప్రజలూ, ఆఖరుకు చిన్న, మధ్యతరగతిపెట్టుబడిదార్లూ, వ్యాపారస్తులూకూడా వ్యతిరేకతను కల్గివుంటున్నారు. అనేక రూపాలలో జరిగే పోరాటాలలో కష్టజీవుల ఈ అసంతృప్తి వ్యక్తమౌతూ వున్నది.

(50) ఉత్పత్తి మొత్తమేగాక, కార్మికుని ఉత్పాదనశక్తికూడా పెరిగింది. అయినప్పటికీ, పెరుగుతూవుండే సంపదలో పెట్టుబడిదారు భాగం పెరుగుతూవుంటే కార్మికుని భాగం తగ్గుతూవున్నది. పెరిగేధరల మూలంగా కార్మికుని వేతనాలవిలువ తగ్గుతూంది. పోరాడి కూలిరేట్లను పెంచుకొనటంలో అతడు కృతకృత్యుడైనా, అత్యవసరవస్తువుల ధరలు పెరుగుతూ వుండటం మూలంగా కూలిరేట్ల పెరుగుదల నిలకడలేనిదిగా వుంటుంది.

(51) వేజ్‌బోర్డులు, కమిషన్లు, ట్రిబ్యునల్సు, త్రైపాక్షికపు ఒడంబడికలు, సమిష్టిఒప్పందాలు మున్నగువాటిద్వారా, పెట్టుబడిదారీ విధానంలోవుండే హానిరేళ్లు అరాచకత్వాన్ని అదుపులోపెట్టే కొంత క్రమాన్ని, ప్రమాణాన్నీ ఏర్పరుచునట్లుగా గత కొలది సంవత్సరాలలో కార్మికులు ప్రభుత్వాన్నీ పెట్టుబడిదార్లనూ వంచుకు రాగల్గారు. ఆర్గనైజ్డ్ పరిశ్రమలలో వ్యాధుల బీమాపద్ధతి, ప్రావిడెంటుఫండుపద్ధతి, జీతంతో సెలవులు సాధింపబడినవి. దేశంమొత్తానికి స్పష్టమైన కనీసపు వేతనం వుండాలన్న అవసరం గుర్తింపబడింది: కాని అది యింకా నెరవేర్చబడవలసియే వున్నది.

(52) ఈ పొందిన సదుపాయాలను అమలు పెట్టించుకోవాలంటే కార్మికులు అనేక పోరాటాలను, త్యాగాలను చేయవలసి వస్తున్నది. ట్రేడ్‌యూనియన్లను గుర్తించడం, గుర్తించకపోవడం యజమానుల యిష్టా ఇష్టాలపై ఆధారపడి వున్నది. ఉత్పత్తిని పెంచాలనే తన కర్తవ్యాన్ని కార్మికుడు నిర్బంధంగా నిర్వహించవలసివుండగా, పారిశ్రామిక యజమాని తన కర్తవ్యాలను నిర్వహించవలసిన పూచీ ఏమీ లేదు; ఏ సంకోచమూ లేకుండా నిరాకరించవచ్చు. కొత్త ఫ్యాక్టరీలు స్థాపించడటంతో పనులు ఎక్కువ దొరుకుతున్నా, అంతకన్నా హెచ్చుగా నిరుద్యోగం పెరుగుతుంది; అందుమూలంగా కార్మిక కుటుంబాల జీవితప్రమాణం పడిపోతూవున్నది. 1939 నాడున్న కూలివేతనాల ప్రమాణాన్నిమించి ఈనాడున్న నిజవేతనాలు ఏమంత ఎక్కువ వున్నట్లుగా కన్పించటంలేదు. బూర్జువావర్గంయొక్క రాజభవనాలు పెరిగిపోతూవుంటే రొచ్చుగుంటలు, పూరిగుడిసెలు అట్లాగేవుంటున్నవి; వాటిని ఉద్ధరిస్తామనే నినాదాలు పాలకవర్గం వెక్కిరింపులుగా మాత్రమే వుంటున్నవి. ట్రేడ్‌యూనియన్ హక్కులనేవి ప్రజాతంత్ర విధానంయొక్క ప్రాణం: కాని ఈరోజున ఈ హక్కులకేమీ విలువలేకుండాపోయింది:

యజమానులు, చిన్నచిన్న సాకులను చూపించికూడా వీటిని ఎగగొట్టు చున్నారు. ప్రభుత్వంనడిపే ఫ్యాక్టరీలు, పరిశ్రమలలో, చాలాకాలంగా వున్న చట్టాలనూ, పద్ధతులనూకూడా దాటించటంలేదు. ఆఖరుకు, కార్మికులపక్షాన సమష్టిగా సంప్రదింపులు, లావాదేవీలు ఒప్పుకునే ప్రాథమిక హక్కుకూడా కార్మికులకు కల్గించలేదు. తమ కే యూనియనుపై విశ్వాసంవున్నదో కార్మికులే నిర్ణయించుకొనే హక్కునుకూడా ప్రభుత్వం నిరాకరిస్తున్నది. పైపెచ్చు, పారిశ్రామిక యజమానుల మద్దతుగల కొన్ని అనామకపు యూనియన్లను కొన్ని చట్టాలప్రకారమో, ఇతర విధానాలనో ప్రభుత్వం ప్రారంభించి వాటిని కార్మికులపై రుద్దుతోంది. ఆవిధంగా, సమష్టి లావాదేవీలను ఫార్సుగా చేస్తున్నది. పబ్లిక్ రంగంలోవున్న, పరిశ్రమలలోవున్న పరిస్థితికూడా ఇంతకు భిన్నంగా ఏమీలేదు.

(53) కోటానుకోట్ల మన రైతాంగం విపరీతమైన దరిద్రంలోనూ, అనాగరికస్థితిలోనూ జీవిస్తున్నారు. రైతాంగంలో ముప్పాతికమందికి దాదాపు స్వంతభూమేలేదు. అనేక లక్షలమంది దమ్మిడీ ఆస్తిలేని గర్భదరిద్రులుగా జీవిస్తున్నారు. విపరీతమైన కౌళ్ళు, వడ్డీలద్వారానూ, ప్రభుత్వం విధించే అధికశిస్తులు, పన్నులద్వారానూ, పెట్టుబడిదారీ మార్కెటులో జరిగే మోసపుపద్ధతులవల్లనూ రైతులు విపరీతంగా దోచుకోబడుతూ వుండటం సాగుతూనే వున్నది. కుటుంబపోషణకుకూడా చాలనివేతనాలకు వ్యవసాయకార్మికులూ, పేదరైతులూ పనిచేయవలసివస్తోంది. పనిదొరకకపోవడం, ఆకలి, అప్పులు, గర్భదరిద్రం—ఒక్కమాటలో చెప్పాలంటే, రైతులనాశనం—ఇదీ ఈనాడు గ్రామసీమలలో మనకు కన్పించేవి.

(54) బస్తీలలోని మధ్యతరగతిప్రజలు ఇంతకన్నా ఎక్కువ బావుకొనేది ఏమీలేదు. వారి బ్రతుకుకూడా అధికజీవనవ్యయం, కొద్ది

జీతాలు, తగ్గిపోతున్న జీవనస్థాయిలతో సతమతమౌతూ వున్నవి. ఇటీ వలకాలంలో మధ్యతరగతిప్రజల నిరుద్యోగం విపరీతంగా పెరిగి పోయింది. కార్మికులవలనే ప్రభుత్వాఫీసులలోనూ, ప్రైవేటుఆఫీసుల లోనూ, బ్యాంకులు, వ్యాపారసంస్థలు, పాఠశాలలు, కాలేజీలు మున్నగు వాటిలో పనిజేసే జీతగాళ్ళుకూడా ఒకేరకమైన సమస్యలను ఎదుర్కొన వలసి వస్తున్నది. లలితకళలు, సాహిత్యం, శాస్త్రవిజ్ఞానం, సంస్కృతి మున్నగు రంగాలలో మన మధ్యతరగతిప్రజలు ముఖ్యమైనపాత్రను వహిస్తున్నారు. కాని, వారిలో చాలామందికి ఈ రంగాలు అందుబాటులో లేవు; కాబట్టి మధ్యతరగతికిజెందిన విద్యార్థులు అనేకమంది ఎంప్లాయ్ మెంటు ఎక్స్ఛేంజీలవద్ద పడిగాపులుపడివుంటూవుండడాన్ని చూస్తున్నాము.

(55) ప్రస్తుత ప్రభుత్వంయొక్క పాలసీలవల్లా, స్వదేశీ, విదేశీ గుత్తసంస్థలయొక్క, గుత్తవ్యాపారస్థులయొక్క కార్యకలాపాలవల్లా చాలామంది పారిశ్రామికాధిపతులు, ఉత్పత్తియజమానులు, వ్యాపారులు, వర్తకులూ దెబ్బతింటున్నారు. పెట్టుబడుల జారీచేయటంలోనూ, ముడి సరుకులు, రవాణా, ఎగుమతి, దిగుమతి లైసెన్సులను మంజూరు చేయ టంలోనూ ప్రభుత్వమూ, బ్యూరాక్రట్లూ అవలంబించే విధానాలు ఒక్క పెద్ద పెట్టుబడిదార్లు మినహా మిగతా అందరూ దెబ్బతింటూ వున్నారు.

## VII

# ప్లానింగు ఫలితంగా ఏర్పడే ఆర్థిక పరిస్థితి

(56) కాబట్టి, రాడికల్ వ్యావసాయిక సంస్కరణలద్వారా మన వ్యవసాయాన్ని పునర్నిర్మించడం, మన దేశంలోవున్న స్వదేశీ, విదేశీ గుత్తపెట్టుబడిదార్లనుండి వనర్లను పూర్తిగా సమీకరించడంగాక, పంచ

వర్ష ప్రణాళికల క్రింద ప్రభుత్వం ఒకవైపున, అభివృద్ధిపేరుతో ప్రజలపై అంతకంతకూ భారాలువేయటం, మరొకవైపున సామ్రాజ్యదేశంయొక్క, మరీ ముఖ్యంగా, అమెరికన్లయొక్క ఆర్థిక 'సహాయం' అనబడేదానిపై ప్లానులు అంతకంతకూ ఎక్కువగా ఆధారపడేటట్లు చేయటం చేస్తున్నది. సోషలిస్టుదేశాలనుండివచ్చే సహాయం కీలకమైన ప్రాధాన్యతకలదియైనా, సోషలిస్టుదేశాలతో మనవ్యాపారంపెరుగుతూవున్నా, భారతీయపెట్టుబడి పరిమాణంలో పెరిగినా, మన ఆర్థికజీవితంలో నేడు కొట్టవచ్చినట్లుగా కన్పడే విషయమేమిటంటే, మొత్తం మన దేశ ఆర్థికం అనేక విషయాలలో పాశ్చాత్యదేశాలసహాయంపైనా, మరీ ముఖ్యంగా అమెరికన్ సహాయం పైనా ప్రమాదకరంగా ఆధారపడివుంది.

(57) ఈ ఆధారపడివుండటం అంతకంతకూ తగ్గడంగాక ఏడాది ఏడాదికీ వాస్తవంగా పెరుగుచున్నది. మూడవ పంచవర్షప్రణాళికలోని మొత్తం పెట్టుబడిలో మూడోవంతు భాగానికి విదేశీసహాయంపై, అందులో ఎక్కువభాగం పశ్చిమదేశాల సహాయంపై ఆధారపడవలసి వస్తోంది. ఆహారధాన్యాల దిగుమతులవిషయంలో సహాయంకొరకేగాక, దిగుమతులను సరిబుచ్చటానికికూడా భారతదేశం అమెరికా తదితర పాశ్చాత్యదేశాలవైపు ఎదురుతెన్నులు కాస్తూవున్నది.

(58) అంతకంతకూ విదేశీసహాయం అవసరాలు మనకు పెరగటంతోబాటు, విదేశీపెట్టుబడికి సదుపాయాలపై సదుపాయాలు కల్పించడం జరుగుతూవున్నది. ఇండియను, విదేశీపెట్టుబడిదారులమధ్య జాయింటు ఒడంబడికలు వందలకొలదీ శాంక్షను చేయబడుచున్నవి.

(59) మన ప్రభుత్వరంగాన్ని అభివృద్ధిచేయడానికి, పారిశ్రామిక ముడిసరుకులను దిగుమతి చేసుకొంటానికి, యంత్రభాగాలను తెచ్చు

కొనటానికీ, ఆహారపదార్థాలను దిగుమతిచేసుకొనటానికీ, మన ఆర్థిక విధానం చాలా హెచ్చుగా విదేశీసహాయంపై ఆధారపడటం మూలంగానూ, విదేశీపెట్టుబడికి అంతకంతకూ హెచ్చుగా సదుపాయాలు కల్గజేస్తూవుండటం మూలంగానూ, ఇక్కడి పెట్టుబడిదార్లతో కలిసి జాయింటుగా పరిశ్రమలు స్థాపించటంద్వారా విదేశీపెట్టుబడి మన దేశంలోకి హెచ్చుగా చొరుచుకు రావటంమూలంగా మన దేశ భవిష్యత్తునూ,ఆంతరంగిక విషయాలలోనూ, విదేశాంగ వ్యవహారాలలోనూ మనం స్వతంత్రంగా వ్యవహరించే సామర్థ్యానికి తీవ్రమైనప్రమాదం ఎదురౌతున్నది. అమెరికన్ సామ్రాజ్యవాదంతో పైనికఒడంబడిక చేసుకోవాలని బహిరంగంగా కోరేటటువంటి, ఆర్థికరంగంలో అమెరికన్ సామ్రాజ్యవాదానికి పూర్తిగా లొంగివుండాలని కోరేటటువంటి కరుడుకట్టిన మితవాద అభివృద్ధినిరోధక శక్తులు దేశంలో తలెత్తటానికి సరిగ్గా ఈ పై పరిస్థితే తోడ్పడుతుంది. నూతనవలస విధానంకొరకై ధాటీగా సాగిపోవటానికై అమెరికన్ సామ్రాజ్యవాదులు వుపయోగించే ప్రధానాయుధాలలో ఈ 'సహాయం' అనేది ఒకటి.

(60) పాశ్చాత్యదేశాలనుండీ, సోషలిస్టుదేశాలనుండీ ఇంత పెద్ద ఎత్తున సహాయంవచ్చినా, పన్నుల వసూళ్ళకై వేసుకొన్న లక్ష్యాలు ఎంతో హెచ్చుగా మించిపోయినా, ప్రణాళికమాత్రం సంక్షోభంలోపడింది. మూడవ పంచవర్ష ప్రణాళిక మొదటి మూడుసంవత్సరాలలోనూ తలసరి సగటు ఆదాయం పెరుగుదల లేకుండా నిలబడివున్నది; ప్రణాళికలోని లక్ష్యాలు నెరవేరుతాయని ఎవరూ ఆశించడంలేదు.

(61) పైగా, ప్రజాసామాన్యంయొక్క దేశభక్తిని రగుల్కొల్పి వాటిని సమీకరించటంలో విఫలమైన ఈ ప్రణాళికలకాలంలో, కేవలం ప్రైవేటు లాభార్జనయే పరమావధియన్న లక్ష్యంపై మరీ ముఖ్యంగా

స్వదేశీ, విదేశీ గుత్తపెట్టుబడిదార్ల లాభాల లక్ష్యంపైననే పూర్తిగా ఆధార పడిన ప్రణాళికలకాలంలో, చిటికెలో ధనికులుకావాలనే అత్యాశ పెరిగి పోయింది. బ్లాకుమార్కెట్టుద్వారా, పన్నులఎగవేతద్వారా, పెద్ద పెట్టుబడి దార్లు వందలకోట్ల రూపాయలను సంపాదించారు; ఇంకాసంపాదిస్తున్నారు. ఈ సంపాదననుకూడా వుత్పత్తిని పెంచటానికై పెట్టుబడిగా పెట్టటంగాక పట్టణాలలో ఇండ్లస్థలాలు, ఆస్తుల స్పెక్యులేషన్‌లోనూ, సరుకులవ్యాపారంలోనూ పెట్టుబడిపెట్టటం జరుగుతూవున్నది.

(6.) పెట్టుబడిదారీప్రధానంలో సర్వవ్యాప్తసంక్షోభం వ్యాపించి వున్నప్పుడు, మరీ ముఖ్యంగా ఈ సంక్షోభం చాలా తీవ్రదశకు జేరు కొన్నప్పుడు వెనుకబడినదేశాలు పెట్టుబడిదారీపంథాలో అభివృద్ధి కాజూడటం పూర్తిగా నిష్ప్రయోజనమని మన మూడుప్రణాళికల అనుభవమూ నిస్సందేహంగా రుజువుచేసింది. అటువంటి అభివృద్ధికివున్న అవకాశాలు అత్యల్పం. ఆర్థికంగా ఇతరులపై ఆధారపడివుండటం, వెనకబడివుండటం, దరిద్రం, నిరుద్యోగంలాంటి మన మూలసమస్యలను అదేమీ పరిష్కరించలేదు. దేశంయొక్క ధన, జన, భౌతికసంపదల నన్నిటినీ అది పరిపూర్ణంగా ఉపయోగించలేదు. అంతకంతకూ పెరిగే వైరుధ్యాలకు అది ఆలవాలమై సంక్షోభాలనూ,ఎగుడుదిగుడు ఆర్థికపరిస్థితులనూ తెచ్చిపెట్టుతుంది; సామాన్యప్రజలపై అది భరించరాని భారాలను వేసి వారి దౌర్భాగ్యాన్ని పెంచుతుంది; భవిష్యత్తు బాగుంటుందనే ఆశనే అంతంజేస్తుంది; తప్పనిసరిగా ప్రజలకూ, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాకూ సంఘర్షణ తెచ్చిపెడుతుంది.

# VIII

# విదేశాంగ విధానం

(33) ఏదేశముయొక్కగాని, ఏ ప్రభుత్వముయొక్కగాని విదేశాంగవిధానం చివరకు గాని దేశాంతర్గతవిధానంయొక్క కొనసాగింపుగానే వుంటుంది; ఆ దేశంలో ఆ ప్రభుత్వంలో పెత్తనం వహిస్తున్న వర్గము లేక వర్గములయొక్క ప్రయోజనాలనే అది ప్రధానంగా ప్రతిబింబిస్తూవుంటుంది. కాబట్టి భారతదేశప్రభుత్వంయొక్క విదేశాంగ విధానం సహజంగా మన బూర్జువావర్గంయొక్క ద్విముఖప్రభావాన్ని, సామ్రాజ్యవాదంతో వ్యతిరేకతకల్గివుంటూనే దీనితో రాజీపడే, సమాధానపడే ధోరణిలోనే ద్విముఖస్వభావాన్ని ప్రతిబింబిస్తూ వుంటుంది. సామ్రాజ్యవాదదేశాలలోని గుత్తపెట్టుబడిదార్లవలెగాక మన భారతదేశపు బూర్జువావర్గం, తనయొక్క అభివృద్ధికిగానే, ప్రపంచశాంతిని కోరుతుంది; అందువల్ల ప్రపంచయుద్ధాన్ని వ్యతిరేకిస్తుంది. ఒకవైపున సామ్రాజ్యవాదపు యుద్ధశిబిరమూలంగా, మరొకవైపున సోషలిస్టు శిబిరముక్రిందా చీలివున్న ప్రపంచంలో భారతప్రభుత్వము జాతీయస్వాతంత్ర్యాన్ని సంరక్షించుకొంటానికిగానూ, బూర్జువా అభివృద్ధి ప్రయోజనాలదృష్ట్యానూ తటస్థత లేక అలీనత అనే విధానాన్ని చేబట్టింది. అదేసమయంలో అది తన స్వప్రయోజనాలను పెంపొందించుకొనటానికై ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదముల మధ్యవున్న వైరుధ్యాలూ, సామ్రాజ్యవాద యుద్ధశిబిరానికి సోషలిస్టు శిబిరానికిమధ్య వైరుధ్యాన్ని వుపయోగించుకోజూస్తున్నది. తటస్థత, అలీనత అనే ఈ స్థూలమైన పరిధిలోనే, ఆర్థిక, రాజకీయ, దేశాంతర్గత, విదేశ పరిస్థితులు, పరిణామాలపై ఆధారపడి విదేశాంగ విధానంలో వేర్వేరుదశలు వుంటూవచ్చినవి.

(64) స్వాతంత్ర్యంవచ్చిన ప్రథమదశలో, తన పారిశ్రామికాభివృద్ధికై సామ్రాజ్యవాదులవైపు, మరీ ముఖ్యంగా అమెరికావైపు ఎదురుతెన్నులు చూస్తూవున్నకాలంలో, అమెరికన్ సైనికబలం అజేయమని విశ్వసించినకాలంలో భారతదేశప్రభుత్వం సామ్రాజ్యవాద శిబిరంయొక్క బలవంతానికి లొంగే వైఖరిని స్పష్టంగా ప్రదర్శించటమూ, దానిపై ఎక్కువగా ఆధారపడటమూ జరిగింది. మలయాలోజరిగే స్వాతంత్ర్య పోరాటాన్ని అణచుటకై బ్రిటిషుసామ్రాజ్యవాదులు గూర్ఖాలను వుపయోగిస్తూ వారిని మన దేశంలో రిక్రూటు చేసుకొనటానికి అవకాశంయివ్వటం, వియత్నాం ప్రజాతంత్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఫ్రెంచి సామ్రాజ్యవాదులుసాగించే పోరాటంలోపాల్గొనడానికిపోయే ఫ్రెంచివిమానాలు మన దేశపు స్థావరాలను వుపయోగించుకొనటానికి అవకాశం యివ్వటం, కొరియాలో యుద్ధంసాగించే అమెరికన్ సైన్యాలకు, నామమాత్రపు వైద్యసహాయమే అయినా, మన దేశంనుండి సహాయాన్నిపంపడం, మన దేశ ఆర్థికాభివృద్ధికి సోవియటుయూనియను చేస్తానన్న సహాయాన్ని తీసుకొనటానికి వెనకముందుండదా, ఈ ధోరణికి స్పష్టమైనచిహ్నాలు. ఈ దశలోనే ఇండియా ఐక్యరాజ్యసమితిలో పశ్చిమదేశాలతో జనరల్గా కలిసివున్నది; ఆఖరుకు, ఉత్తరకొరియాను దురాక్రమణదారు అని ఆరోపణ చేయించటంలోనూ, ఐక్యరాజ్యసమితి ముసుగుతో అమెరికన్ సైన్యాలు కొరియా నూతన ప్రజాతంత్ర రిపబ్లికుపై దురాక్రమణచేయటంలోనూకూడా ఈ పశ్చిమదేశాలలో ఇండియా కలిసివున్నది. ఈ విషయాన్ని ఐక్యరాజ్యసమితిలో భారతదేశప్రతినిధి స్పష్టంగా, సూటిగా ఒప్పుకొనికూడా వున్నది.

(65) కొరియాలోనూ, వియత్నాంలోనూ సామ్రాజ్యవాద సైన్యాలు శృంగభంగంపొందటంతో, సోషలిస్టు ప్రపంచంయొక్క ఆర్థిక సైనిక శక్తి పెరగటంతో, పాశ్చాత్యదేశాలకు, ముఖ్యంగా అమెరికాకు, అన్యా

యుద్ధాలపైవున్న గుత్తాధిపత్యం భగ్నంకావటంలో, ఆసియా, ఆఫ్రికా దేశాలలో జాతీయవిముక్తి వుద్యమాలు అప్రతిహతంగా పురోగమించ టంలో, వీటన్నింటిమూలంగా సోషలిజం, శాంతి, జాతీయ స్వాతంత్ర్య ములను మరింత అనుకూలంగా ప్రపంచశక్తుల బలాబలాలలో మొగ్గు కన్పించటంలో, సామ్రాజ్యవాదులనుండి తన ఆర్థికాభివృద్ధికి బ్రహ్మాండ మైన సహాయం వస్తుందని పెట్టుకొన్న ఆశలు పటాపంచలుకావటంతో, కీలకమైన పరిశ్రమలను సోషలిస్టుదేశాలయొక్క నిస్వార్థసహాయంతో నిర్మించుకొనటానికి అవకాశాలు ఎక్కువగా కన్పడటంతో, శాంతి వుద్యమం అభివృద్ధికావటంతో, ప్రజల చైతన్యస్థాయి పెరిగినదని మొదట జనరల్ ఎన్నికలద్వారా రుజువుకావటంతో, ఇండియాను ఒత్తిడి చేయడానికిగాను సియాటో మిలిటరీకూటమిలో పాకిస్థాను జేరటానికై అమెరికన్—పాకిస్థాన్ ఒడంబడిక జరగటంతో భారతప్రభుత్వం యొక్క అలీనవిధానంలో మరొక కొత్తదశ ప్రారంభమైనది. ఈ దశ లోనే ప్రభుత్వం మిలిటరీ కూటములకు వ్యతిరేకంగానూ, సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగానూ గట్టిగా నిలబడింది. వలసదేశప్రజల స్వాతంత్ర్య పోరాటాలను బలపర్చుటకూ, అణ్వాయుధాల నిషేధానికీ, నిరాయుధీకరణకూ ఆఫ్రో - ఆసియాదేశాలమైత్రికీ కృషిచేసింది. కొరి యాలో సంధినికుదర్చటానికిప్రయత్నించటంలోనూ,వియత్నాం,లావోస్, కాంబోడియాల విషయంలో ఒప్పందానికి వస్తానికై జరిగిన జెనీవాసభలో చురుకైనపాత్రను వహించడంలోనూ, పంచశీలసూత్రాలను రూపొందిస్తూ టిబెటు విషయమై ఇండియా - చైనా ఒడంబడికను కుదుర్చుకొనటం లోనూ, ఆఫ్రో-ఆసియాదేశాల బాండుంగ్ మహాసభలో సముచితపాత్రను వహించటంలోనూ ఈ నూతనదశ ద్యోతకమౌతుంది.

అలీనవిధానానికి ఇవ్వబడిన ఈ నూతన సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావం అంతర్జాతీయ రాజకీయపరిణామాలలో క్రియాశీలకమైన పాత్రను

నిర్వహించింది. యుద్ధవిధానాలకు వ్యతిరేకంగానూ, అణ్వాయుధాల రాజకీయపుబెత్తులకు వ్యతిరేకంగానూ, అంతర్జాతీయవివాదాల శాంతి యుత పరిష్కారంకొరకూ, శాంతియుతసహజీవనంకొరకూ, ఇండియా మరింత దృఢంగానిలబడింది. సోషలిస్టుదేశాలతో భారతదేశం సంబం ధాలు మరింత సన్నిహితమైనవి. స్నేహసంబంధాలు పెరిగినవి. దేశం యొక్క అంతర్జాతీయప్రతిష్ఠ పెరిగింది: ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా దేశాలలో ఈ ప్రతిష్ఠ పెరిగింది.

(66) దాదాపు 1958 నుండి భారతదేశపు విదేశాంగవిధానం మరొక కొత్తదశలో ప్రవేశించింది. కాంగోలో దానిపాత్ర, ఆల్జీరియా తాత్కాలిక ప్రభుత్వాన్ని గుర్తించకపోవటం, అనేక వలసవిధానపు వ్యతి రేక సమస్యలమీద గట్టివైఖరి తీసుకొనకపోవటం, లావోస్, వియత్నాంల విషయంలో అంతర్జాతీయ కంట్రోలు కమిషనులో తీసుకొనే సందిగ్ధ వైఖరి, ఆఫ్రికా ఆసియాలోని అనేకదేశాలకు దూరమైన విధంగా కైరో సన్నాహక సంఘంలోనూ, 1961 బెల్‌గ్రేడ్ అలీన రాజ్యం సమావేశం లోనూ తీసుకొన్నవైఖరి, సామ్రాజ్యవాదపు బెత్తుగడయైన మలేషియాకు ఆమోదాన్ని తెలియజేసి ఆదేశాన్ని గుర్తించటం, ఇవన్నీకూడా ఈ నూతనదశకు సాక్ష్యధారాలు.

ఇటీవలనే తమ బానిస శృంఖలాలను త్రెంచివేసుకొన్న అనేక ఆసియా, ఆఫ్రికా దేశాలు ఈ సమస్యలపైనా, ఇటువంటి ఇతర సమస్యల పైనా ఇంతకన్నా ఎక్కువ ఖచ్చితమైన, స్పష్టమైన వైఖరిని తీసుకొన్న విషయం గమనార్హం. సోషలిస్టు శిబిరం శక్తిసంపదలు మరింత పెర గటంవల్లా, ఆఫ్రికాలోని అనేక దేశాలు స్వాతంత్ర్యాన్ని సంపాదించటం వల్లా, లాటిన్‌అమెరికా దేశాలలో స్వాతంత్ర్యోద్యమాలు ఉధృతంకావటం

వల్లా మరింత అనుకూలంగా మారిన అంతర్జాతీయపరిస్థితిలో స్వతంత్ర భారతదేశం ప్రభుత్వం అలీనవిధానం, శాంతి, వలసవ్యతిరేకవిధానాలను మరింత పట్టుదలతో ముందుకు తీసుకుపోతుందని ఎవ్వరైనా ఆశిస్తారు. కాని సరిగ్గా దీనికి భిన్నంగానే జరిగింది.

**(68)** భారతదేశంలో గుత్తపెట్టుబడిసంస్థలు, బడాపెట్టుబడిదార్లు పెరగటం, ప్రభుత్వంవల్ల చురుకుగా ప్రోత్సహించబడుతూ సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడిసంస్థలతో వాటికి లింకులు పెరగటం, సోవియటు యూనియను, ఇతర సోషలిస్టుదేశాలనుండి ప్రాణప్రదమైన పారిశ్రామిక, టెక్నికల్, ఆర్థికసహాయాన్ని ఇతోధికంగా పొందుతూవున్నా తన పంచవర్షప్రణాళికలకుగాను పాశ్చాత్యదేశాల సహాయంపై మరింత ఎక్కువగా ఆధారపడుతూ వుండటం, భారతదేశప్రజలను ఎదుర్కొనే ఏ ఒక్క మూలసమస్యనూ ప్రభుత్వం పరిష్కరించలేకపోవటం, ఇందుకు భిన్నంగా శ్రామికప్రజలు అధికారంలోవున్న దేశాలు అచిరకాలంలోనే దృఢమైన సోషలిస్టు, ఆర్థికవ్యవస్థను నిర్మించుకొన్నదానితో పోల్చితే వుండే తేడా, ప్రభుత్వపాలసీల ఫలితంగా దేశంలో సామాజిక వైరుధ్యాలు పెరిగి మరింత తీవ్రంఅవుతూ వుండటం, ఇవన్నీ కూడా, విదేశాంగ విధానంతోసహా అన్ని ప్రభుత్వపాలసీలమీదా విపరీతమైన ప్రభావాన్ని కల్గజేస్తూవుంటాయి. సరిగ్గా ఈ పరిణామాల ఫలితమే, భారత ప్రభుత్వపు విదేశాంగవిధానంలోని నూతనదశ; సరిగ్గా ప్రస్తుతం ప్రభుత్వం యొక్క వర్గస్వభావంనుండి ఈ నూతనదశ ఉద్భవిస్తున్నది. సామ్రాజ్యవాద సహాయంపై అంతకంతకూ ఎక్కువగా ఆధారపడుతూ వుండటం మూలకంగానే కాశ్మీరుసమస్యలో మనకూ, పాకిస్థానుకూవున్న వివాదంలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు మరింత ఎక్కువగా జోక్యం కల్గించుకొంటానికి సాధ్యపడింది.

(6ఫ) ఆశియాఖండంలో అన్నిటికంటే పెద్దవైన రెండుదేశాల మధ్య సరిహద్దు యుద్ధానికిదారితీసిన చైనాతోటి సరిహద్దువివాదమూ. ఆనాటినుండీ సాగుతున్న ప్రచ్ఛన్నయుద్ధమూ భారతప్రభుత్వంయొక్క విదేశాంగవిధానంలోని ఈ మార్పు మరింత ప్రస్ఫుటమైనది. అమెరికా, బ్రిటనులనుండి ప్రభుత్వం మిలిటరీ సహాయాన్ని తీసుకొనటం, మరింత హెచ్చుగా మిలిటరీ సహాయంకొరకై ఆ ప్రభుత్వాలను అర్థించుతూ వుండటం, వాయిస్ ఆఫ్ అమెరికాఘటన, అమెరికన్, బ్రిటిషు విమాన బలాలతో కలిసి సంయుక్త వైమానిక విన్యాసాలు జరపటం, హిందూ మహాసముద్రంలోకి అమెరికన్ సప్తమ నౌకాదళం ప్రవేశించటంలో ప్రభుత్వం దాదాపు అంగీకారాన్ని తెల్పటం. దక్షిణవియత్నాంలో తాను సాగించే యుద్ధాన్ని వియత్నాం ప్రజారిపబ్లికుదేశానికి విస్తరింపజేస్తానని అమెరికన్ ప్రభుత్వంచేసిన బెదరింపుయెడ ప్రభుత్వం మౌనం వహించి వుండటం-ఇవన్నీకూడా అలీనవిధానం తీవ్రమైనప్రమాదంలో పడేస్థితికి తీసుకువెళ్ళాయి: ఆ విధానం కృశించిపోతున్నది. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని, పూర్తిగా పశ్చిమరాజ్యాలతో జేరువిధంగా సామ్రాజ్యవాదులు భారతదేశంపై పెద్దఎత్తున ఒత్తిడి తీసుకువస్తున్నారు: అలీనవిధానపు విదేశాంగ విధానాన్ని మరింత బలహీనపర్చి, అసలు దానిని పూర్తిగా విసర్జించునట్లుగా దేశంలోని అభివృద్ధినిరోధకులు ప్రభుత్వాన్ని నెట్టజూస్తున్నారు. ఈ అభివృద్ధి నిరోధకశక్తులనూ, వారి కుట్రలనూ పూర్తిగా బట్టబయలుచేస్తేనేతప్ప, ఇటువంటి జాతీయవ్యతిరేక కుట్రలకు కారణభూతమైన వాస్తవికమూలాన్ని సాధ్యమైనంత త్వరలో తొలగిస్తే తప్ప, ప్రమాదం ఎప్పుడూ మనలను వెన్నాడుతూనే వుంటుంది. వీటన్నిటి ఫలితంగా మన దేశప్రతిష్ఠ ఆసియా, ఆఫ్రికాదేశాలలో బాగా దెబ్బతిన్నది: ప్రపంచమందలి సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తుల కన్నింటికీ ఇది ఆందోళన కలిగిస్తున్నది.

(70) అయినప్పటికీ, భారత బూర్జువావర్గానికీ, సామ్రాజ్యవాదానికీ మధ్య వైరుధ్యాలు కొనసాగుతూనే వున్నవి. కాశ్మీరుసమస్య విషయంలోనూ, ఆ సందర్భంగా సామ్రాజ్యవాదులుజేసిన కుట్రలలోనూ, ప్రజల ఒత్తిడిమూలకంగా హాయిస్ ఆఫ్ అమెరికాబేరం వదలుకోబడ్డప్పుడూ ఇది స్పష్టంగా కన్పించినవి.

(71) ప్రపంచయుద్ధానికి వ్యతిరేకత, అలీనవిధానం అనే స్థూలమైన పరిధిలోనే ప్రభుత్వపు విదేశాంగవిధానం వుంటూ వున్నా, తన పంచవర్ష ప్రణాళికలనుకొనసాగించటానికి పాశ్చాత్యదేశాల గుత్తపెట్టుబడిదార్ల సహాయంపై అంతకంతకూ ఎక్కువగా ఆధారపడటం, ఇటీవల కాలంలో చాలా వలసవ్యతిరేకసమస్యలపై ముఖావం వహించి వుండటం మూలకంగా అమెరికన్ నయావలసవిధానం, దురాక్రమణ వుద్దేశాలు సాగుటకు భౌతికంగా ఉపయోగపడటం, శాంతి, ప్రజాతంత్రం, స్వాతంత్ర్యం, సోషలిజముల మహాప్రవాహంనుండి మన దేశం మారమవటం, ఆవిధంగా మన ప్రయోజనాలకు హానికల్గటం జరుగుతుంది.

# IX

# కాంగ్రెసు పాలనలో రాజ్యాంగయంత్రం, ప్రజాతంత్రం

(72) ప్రస్తుతపు భారత రాజ్యాంగయంత్రం బడాబూర్జువా నాయకత్వానవున్న బూర్జువా భూస్వామ్యవర్గాల వర్గపరిపాలనయొక్క సాధనం. ఈ వర్గస్వభావమే మన దేశజీవితంలో రాజ్యాంగయంత్రంయొక్క పాత్రనూ, విధులనూ ప్రధానంగా నిర్ణయిస్తుంది.

(73) స్వాతంత్ర్యసిద్ధి తర్వాత కాంగ్రెసునాయకత్వం రిపబ్లికన్ ఇండియాయొక్క నిర్మాణాన్ని భాషారాష్ట్రాల ప్రాతిపదికపైనా, ఈ రాష్ట్రాలను పూర్తి స్వపరిపాలనాధికారం, ఆదిమజాతుల ప్రాంతాలకు ప్రాంతీయ లేక స్థానికపరిపాలనాధికారం వుండేవిధంగా తీర్చిదిద్దుతుందని ఆశించాము. ఫ్యూడల్ సంస్థానాలను అది రద్దుచేసి భారతయూనియన్‌లో లీనంచేసినా, సంకుచితదృష్టిగల, అభివృద్ధినిరోధకమైన గుత్తపెట్టుబడి దారీ గ్రూపులయొక్కప్రభావంవల్ల ఈ రాష్ట్రాల నన్నిటినీ భాషాప్రాతిపది కపై పునర్నిర్మించడానికి నిరాకరించింది. ప్రజాతంత్రప్రజల పోరాటాల ఒత్తిడి ఫలితంగా చిట్టచివరకు, అప్పటికీ అయిష్టంగానే, ఆగి ఆగియే ఈ సమస్యాపరిష్కారం జరిగింది. ఇప్పటికీ కొన్ని సమస్యలు అపరి ష్కృతంగానే వుండిపోయినవి.

(74) భాషాసమస్య సంతృప్తికరంగా పరిష్కరింపబడలేదు. వివిధరాష్ట్రాల భాషలు ప్రభుత్వపరిపాలనాభాషగా, కోర్టులలో వ్యవహార భాషగా, విద్యాలయాలలో బోధనాభాషగా ఇంకా అంగీకరింపబడవలసియే వున్నవి. మన పరిపాలనలోనూ, విద్యాబోధనలోనూ ఇంగ్లీషుదే ఇంకా ప్రధానస్థానం. పరిపాలనా వ్యవహారాలలోనూ, విద్యాభ్యాసంలోనూ ప్రాంతీయభాషలు తమ సముచితస్థానాన్ని ఇంకా పొందకమునుపే, పార్ల మెంటులోనూ, కేంద్రప్రభుత్వ పరిపాలనా వ్యవస్థలోనూ వీటి సమాన హోదాను ఆచరణలోపెట్టటానికి చర్యలేమీ తీసుకొనకముందే, హిందీ యేతరప్రజలపై ఇంగ్లీషుస్థానే హిందీని రుద్దటానికి ప్రయత్నాలు జరుగు చున్నవి. ఇందువల్ల ఈ రాష్ట్రాలప్రజలకు తమ భాషలకు న్యాయమైన స్థానం లభించదేమోననేభయమూ, అణచివేయబడతాయనే భయమూ కలుగుచున్నది.

(75) భారతరాజ్యాంగచట్టంక్రింద పయోజనటటింగు ప్రాతిపది కపై ఎన్నుకోబడే పార్లమెంటువున్నది. ప్రజలకు కొన్ని ప్రాథమిక హక్కులు ప్రసాదింపబడినవి. కాని పార్లమెంటరీ అధికారాన్ని బూర్జువా వర్గం తన కనుకూలంగానూ, ఇతర దోపిడీవర్గాలకు అనుకూలంగానూ వుపయోగిస్తున్నదిగాని ప్రజలప్రయోజనాలకు అనుకూలంగా వుపయో గించడంలేదు కాబట్టి ప్రజలను సంరక్షించటంలోగాని, పరిస్థితిని ప్రజల కనుకూలంగా మార్చడంలోగాని ఇవి విఫలమౌతున్నది.

(76) మన రాజ్యంగయంత్ర నిర్మాణం ఫెడరల్ నిర్మాణం అని చెప్పబడినా అధికారమంతా వాస్తవానికి కేంద్రప్రభుత్వం చేతులలోనే కేంద్రీకరింపబడివున్నది. ఇండియన్‌యూనియన్‌లోవున్న రాష్ట్రాలకున్న అధికారాలు, అవకాశాలూ చాలా పరిమితంగానే వున్నవి; వాటి స్వపరి పాలనాధికారం నామమాత్రమే ఇందువల్ల ఈ రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వంమీదనే ఆధారపడివుండాలి; వాటి అభివృద్ధే, ఇతర జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలూ హద్దులో వుంచబడుతాయి. అందుమూల కంగా వాటి అభివృద్ధి కుంటుబడుతుంది.

(77) అందువల్ల, ఇటువంటి పరిస్థితులలో సహజంగానే కేంద్ర ప్రభుత్వానికి, రాష్ట్రాలకూమధ్య వైరుధ్యాలు పెరగటంలో ఆశ్చర్యం లేదు. ఈ వైరుధ్యాలకు అట్టఅడుగున మరొక గాఢమైన వైరుధ్యంకూడా వున్నది. ఒకవైపున బడాబూర్జువావర్గానికి, మరొకవైపున బూర్జువా వర్గంతోసహా,ఈయా రాష్ట్రంలోని మొత్తం ప్రజానీకానికి మధ్యవున్నదే ఈ గాఢవైరుధ్యం. పెట్టుబడిదారీవిధానంలోవుండే అసమానాభివృద్ధి పెరు గుతూ వుండటం మూలకంగా ఈ గాఢవైరుధ్యం సదా తీవ్రమౌతూనే వుంటుంది.

(78) కొన్నిరాష్ట్రాలలో ఆదిమజాతులు నివసించే ఏకఖండ ప్రాంతాలు వున్నవి. ఈ ఆదిమజాతులకు వారి విశిష్టమైనభాష,సంస్కృతి, సాంప్రదాయాలు వున్నవి. ఈ నూతన పెట్టుబడిదారీ అభివృద్ధిక్రమంలో ఈ ప్రజలు మార్పుచెందుతూ, నాశనమైపోతూవున్నారు. వారిలోకూడా నూతన జాగృతి కల్గుతోంది: కాని ఇండియన్‌యూనియన్‌యొక్క పెద్ద రాష్ట్రాలలో చిన్నచిన్న గ్రూపులుగా చెదిరివున్నవారి ప్రస్తుతపరిస్థితులలో ఈ నూతన జాగృతి క్రియారూపం తీసుకొంటానికి అవకాశాలు కన్పించటంలేదు. తమసంఖ్య, భౌగోళిక పరిస్థితుల పరిధిలో అటువంటి అవకాశాల నుపయోగించుకొని తమ ప్రాంతాల నభివృద్ధి చేసుకొంటానికై వారు ప్రాంతీయ స్వపరిపాలనను కోరుచున్నారు. కాని, అడవులు, గనులు మున్నగుచోట్ల ఈ ఆదిమజాతులు చవుకగా కార్మికులుగా వుపయోగపడుతారుగనుకే, వారి ఆదిమ జీవనపద్ధతులబట్టి తేలికగా దోపిడీకి గురియౌతారుగనుకా బూర్జువావర్గం వీరి న్యాయమైన హక్కులను గుర్తించ నిరాకరిస్తూ వారిని బలప్రయోగంతో అణచివేస్తున్నది: లేదా వారిలోని పెద్ద నాయకులకు కొన్ని సదుపాయాలు కల్గజేసి వారిలో చీలికలు కల్గిస్తున్నది.

(79) పెట్టుబడిదారీ పోటీపరిస్థితులలో, రాజ్యాంగచట్టంలో మైనారిటీలకు గ్యారంటీ చేయబడి హక్కులుకూడా అమలుజరపబడటంలేదు. ఈ విధంగా బూర్జువా-భూస్వామ్య ప్రభుత్వం మధ్యగామి శక్తులనూ, విచ్ఛిన్నశక్తులనూ పెంచుతూ, ఆవిధంగా, గట్టిపునాదులపై దేశ సమైక్యతను నిర్మించడంలో విఫలమౌతూ వున్నది.

(80) పెట్టుబడిదారీవిధానపు అభివృద్ధిని ప్రతిఫలించేవిధంగా పరిపాలనా యంత్రాంగమంతా అత్యధికమైన కేంద్రీకృత నిరంకుశోద్యోగి బృందంగా తయారైంది: అందువల్ల అధికారమంతా కేంద్రంలో కేంద్రీకరింపబడి వున్నది. ఈ అధికారం ప్రజలకుదూరమై, కేవలం దోపిడీ

వర్గాల ప్రయోజనాలకు విధేయతతో సేవలుచేసే స్వాధికార నిరంకుశోద్యోగులచే సాగించబడుతూ వున్నది. కాబట్టి పంచాయతీరాజ్యం అనబడేది వాస్తవానికి గ్రామసీమలలో తమ శక్తిని బలపర్చుకోజూచే పరిపాలకవర్గాల చేతులలో ఒక సాధనంగా వుపయోగపడుతోంది. కాబట్టి ఇటువంటి దోపిడిగాండ్లు. నిరంకుశోద్యోగులచే నడపబడే బూర్జువా ప్రజాతంత్రంలో ప్రజల నిజమైన ప్రజాతంత్ర ఆచరణకు స్థానమేలేదు.

(81) కార్మికులు, రైతులు, శ్రామికప్రజలలోని ఇతర సెక్షన్లకు వ్యతిరేకంగానే న్యాయస్థానాలు పనిచేస్తున్నవి. సిద్ధాంతరీత్యా ధనికులకు బీదలకూ సమానహోదాలోనే చూడాలనివున్నా చట్టాలూ, కోర్టుతతంగాలూ, న్యాయవిధానాలూ అన్నీ దోపిడీవర్గాల ప్రయోజనాలకే వుపయోగపడుతూ వారి వర్గపరిపాలననే నిలబెట్టజూస్తున్నది. న్యాయశాఖను పరిపాలనాశాఖనుండి విడదీయాలనే బూర్జువా ప్రజాస్వామిక సూత్రాన్ని కూడా అనుసరించడంలేదు; న్యాయశాఖ పరిపాలనాశాఖయొక్క కంట్రోలుకూ, పలుకుబడికీ గురియౌతూవున్నది.

(82) భూమి. పెట్టుబడి తదితర జీవనసాధనాలన్నింటిమీదా యాజమాన్యం కల్గివుండటం మూలకంగా రైతాంగం, కార్మికులు, మధ్యతరగతి ప్రజలపై పరిపాలనజేస్తూ దోచుకొంటూవుండే బూర్జువావర్గమూ, వారి భూస్వామికవర్గ మిత్రులూ, పైవారితోపోలిస్తే చాలా స్వల్పసంఖ్యలో వున్నారు. ప్రజాతంత్రవ్యవస్థయొక్క పార్లమెంటరీ విధానంలో మెజార్టీ ఓట్లతో ఎన్నుకోవలసినప్పటికీ పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రమూ, ప్రభుత్వమూ, రాజకీయంగానూ, ఆర్థికరీత్యానూ మూలంలో మైనారిటీ పరిపాలనగానే వుంటున్నది.

(83) ఈ పరిపాలనాధికారమూ, గతవర్గప్రయోజనములూ దోచుకోబడే వర్గాల ప్రయోజనాలతో బహిరంగంగా సంఘర్షణపడేటప్పుడు

ప్రభుత్వం తన వ్యవస్థను నిలబెట్టుకొనటానికి అంతకంతకూ హెచ్చుగా పోలీసు, మిలిటరీ బలగాలపై ఆధారపడుతుంది. అందువల్లనే ఈ బల గాలలోని సామాన్యులను వందలు వేలుగా వున్నవారిని ప్రజలకు దూరంగా, రాజకీయ చైతన్యానికి దూరంగా, ప్రజాతంత్ర హక్కులకు దూరంగా వుంచుతుంది. ఎన్నికలలో సామాన్య పౌరులుగా వారు తమ ఓటింగు హక్కును వినియోగించుకొనే సందర్భంలోకూడా వారిని ఏ రాజకీయ పార్టీకూడా, అభ్యర్థు కరపత్రాలద్వారాకూడా కలుసుకొన టానికి వీలులేకుండా దూరంగావుంచుతారు. ఏ విషయంపైనా తమ పార్లమెంటుప్రతినిధిని కలుసుకొనే హక్కునుకూడా నిరాకరిస్తున్నారు.

(84) ప్రధానంగా బూర్జువా - భూస్వామ్యవర్గాలనుండే వచ్చే వారూ, ప్రత్యేక విద్యాసంస్థలలో విద్యాభ్యాసం గావించేవారూ అగు సైన్యాధిపతులకూ, ఇతర పెద్ద అధికార్లకూమాత్రం ఈ నిషేధాలూ, నియమాలూ అధికంకావు. వారు మాత్రం వారి రాజకీయాలను తెరమ రుగున వారిపద్ధతులలో సాగిస్తూనే వుంటారు.

(85) రాజ్యాంగచట్టం కొన్ని ప్రాథమిక హక్కులను నిరూపిం చింది। కాని ప్రజలు వాటిని పరిమితంగానే వుపయోగించుకోగల్గు తున్నారు. ప్రభుత్వాధికారులు ఈ ప్రాథమిక హక్కులలో అనేకమైన వాటికి వక్రభాష్యాలు చెప్పుతున్నారు; చివరకు వాటిని ఉల్లంఘిస్తున్నారు కూడా. కార్మికులు, రైతులు, ఇతర ప్రజాస్వామిక ప్రజల పోరాటాల సందర్భంవస్తే ఈ ప్రాథమిక హక్కులు వారికి అందకుండా పోతాయి. శాంతిభద్రతలను కాపాడటమనే పేరుతో, వేలు, లక్షలమంది ప్రజలు నివసించే విశాలప్రాంతాలను సెక్షన్ 144 క్రిందపెట్టి సభలు, సమా వేశాలు జరగనీయకుండా, అంటే, కార్మికులు, రైతులు తమ హక్కు

లను సంరక్షించుకొనేందుకు సమావేశమవటానికి వీలులేకుండా, నిషేధించడం జరుగుతూ వున్నది. తమ రాజకీయ ఆర్థిక హక్కులు, కోర్కెల సంరక్షణకై కార్మికులు, రైతులు, ఇతర ప్రజాతంత్ర ప్రజలూ కార్యాచరణకు పూనుకొన్నప్పుడు ప్రభుత్వ యంత్రాంగాలు వుపయోగించే బలప్రయోగం మిక్కిలి దారుణంగా వుంటోంది.

(86) వాస్తవానికి దినపత్రికలు, థియేటర్లు, హాల్సు, విస్తారమైన నిధులుగల దోపిడివర్గాలకు మాత్రమే వాక్సభా సమావేశ పత్రికా స్వాతంత్ర్యాలూ, ప్రచార స్వాతంత్ర్యం లభ్యమౌతున్నవి. ఈ విస్తారమైన సాధన సంపత్తితో శ్రామిక ప్రజలు పోటీచేయలేరు. అందుచే నామకః అందరికీ ఈ హక్కులు యివ్వబడినా వాటిని శ్రామిక ప్రజలు వినియోగించుకోలేకపోతున్నారు. బూర్జువాతంత్రమనేది ఎల్లప్పుడూ దోపిడీవర్గాలకు వుపయోగపడే ప్రజాతంత్రమే ! శ్రామిక ప్రజలకు మాత్రం అది కాగితాలమీదనే వుండిపోయే ప్రజాతంత్రం; నీళ్ళలో మూటలాగా వుండిపోయే ప్రజాస్వామ్యం.

(87) అయినప్పటికీ ప్రజాతంత్రం కొరకూ, తమ హక్కుల రక్షణకొరకూ ప్రజలు జరిపే పోరాటాలలో వయోజన ఓటింగుహక్కు, పార్లమెంటు, శాసనసభలూ వారికి సాధనాలుగా వుపయోగపడుతాయి. ఇండియాలో నేడున్న పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థ బూర్జువావర్గ పరిపాలనకు ఒకానొక రూపమే అయినా, ఇది ప్రజలకుకూడా ఒక ముందడుగుగానే వుంటుంది. ప్రజలు తమ ముఖ్యప్రయోజనాలనుకాపాడుకొనుటకూ, ప్రభుత్వ వ్యవహారాలలో కొంతవరకూ జోక్యంకల్గజేసుకొనటానికీ, ప్రజలకు భ్రమలను తొలగించి శాంతి, ప్రజాస్వామ్యం, సామాజికాభివృద్ధికొరకై సాగే పోరాటంలో వానిని సమీకరించటానికీ అది కొన్ని అవకాశాలను కల్గజేస్తుంది.

(88) శ్రామిక ప్రజలనుండీ, వారి ప్రయోజనాలను కాపాడే పార్టీలనుండీకాదు. పార్లమెంటరీ వ్యవస్థకూ, ప్రజాతంత్రానికీ వచ్చే ప్రమాదం; ఈ ప్రమాదం వచ్చేది దోపిడి వర్గాలనుండి. తమ సంకుచిత ప్రయోజనాలను పెంపొందించుకొనటానికి దానికొక సాధనంగా వినియోగించడంద్వారానూ, ప్రజలను అణచటానికి ఒక ఆయుధంగా వాడడం ద్వారానూ ఈ వర్గాలు పార్లమెంటరీ వ్యవస్థలలోనుండీ, బైటనుండీ కూడా తొలచి వేస్తారు. తమ వుద్యమాలను బలిపర్చుకోటానికై ప్రజలు పార్లమెంటరీ సంస్థలను వుపయోగించుకొన ప్రారంభించినపుడు, ఈ సంస్థలు అభివృద్ధి నిరోధక బూర్జువా భూస్వామ్య వర్గాల పలుకుబడి నుండి దూరంకా ప్రారంభించినప్పుడు, 1959 లో కేరళలోవలె పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని కాలరాస్తానికి ఈ వర్గాలు వెనుదీయవు. అవసరం వచ్చినప్పుడు వారు పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని త్రోసివేసి దానిస్థానే మిలిటరీ నియంతృత్వాన్ని స్థాపించటానికికూడా సంకోచించరు. మన దేశానికి ఇటువంటి ప్రమాదాలేమీ లేవని ధీమాతో వుండటం గొప్ప నేరమౌవుతుంది; ప్రమాదకరమైన భ్రమలు పెట్టుకోవటమూ అవుతుంది. పార్లమెంటరీ సంస్థలనూ, ప్రజాతంత్ర సంస్థలనూ కమ్యూనిస్టులు కాపాడుతారు. వారు వాటిని నిలబెట్టి మరింత అభివృద్ధిజేసి, ప్రజాతంత్రాన్ని నిజమైనదిగా జేస్తానికీ, అందరికీ లభ్యమగునట్లు చేస్తానికీ చూస్తారు.

## X

# ప్రజా ప్రజాతంత్రి కార్యక్రమం

(89) పెట్టుబడిదారీ విధానాలయెడా, దానిని, నిర్మించటానికిచేసే ప్రయత్నాలయెడ మన ప్రజలలో భ్రమలు తొలగటం, అసంతృప్తి పెర

గడం త్వరితమౌతోంది. ప్రస్తుతమున్న బూర్జువా - భూస్వామిక పరిపాలనలో వెనుకబడినతనంనుండీ, దరిద్రాన్నుండీ, ఆకలినుండీ, దోపిడీ నుండీ విముక్తి కల్గటానికి ఆశలేమీ లేవని అనుభవమే వారికి నేర్పుతోంది. ప్రజలలో సోషలిజంయెడ అంతకంతకూ ఆకర్షణ పెరగడం ద్వారా ఈ జాగృతిని గుర్తించవచ్చును. ప్రజలదృష్టిలో పెట్టుబడిదారీ విధానం ఒక వ్యవస్థగా దివాళాకోరుదని తేలిపోయింది. సరిగ్గా ఇందు వల్లనే మన బూర్జువా పరిపాలకులుకూడా పెట్టుబడిదారీ అభివృద్ధికై తాము గావించే ప్రయత్నాలకు కూడా సోషలిజం బోర్డును తగిలిస్తున్నారు.

(90) మనం ఇప్పుడు వుంటున్న చారిత్రక పరిస్థితులలో, బలమైన ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడి అతివేగంగా అభివృద్ధి జెందుతూవున్న దశలో, ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ అతి శీఘ్రంగా శిధిలమౌతూవున్నకాలంలో, ఆర్థికంగా వెనుకబడిన, తక్కువ అభివృద్ధియైన అనేక దేశాలలో, అవి స్వాతంత్ర్యం పొందిన పిమ్మట, జాతీయ ప్రజాతంత్ర ప్రభుత్వాలను ఏర్పర్చటానికి పెద్ద నూతనావకాశాలు ఏర్పడినవి. ఇటువంటి ప్రభుత్వంలో అభివృద్ధిజెందే కార్మికవర్గం క్రమంగా నాయకత్వం సంపాదించడంద్వారా, దేశాన్ని పెట్టుబడిదారీయేతరమైన అభివృద్ధిపథంలో తీసుకొనిపోగలదు; పెట్టుబడిదారీ దశను దుమికేసి సోషలిజానికి పోగలదు.

(91) కాని ఇండియాలో మనకు అటువంటి మార్గంలేదు. బ్రిటిషు వలసపరిపాలనక్రింద వున్నకాలంలోనే మనదేశం పెట్టుబడిదారీ పద్ధతులలో అభివృద్ధియైన వలస, అర్ధవలసదేశాలలో ఒకటిగా వుండేది. జాతీయ విముక్తి వుద్యమానికి నాయకత్వం వహించి, అటుపిమ్మట 1947 నుండీకూడా నూతన ప్రభుత్వంలో అధికారంలోవుంటూ వచ్చిన దేశీయ బూర్జువావర్గం దాదాపు రెండు దశాబ్దాలు వరుసగా రాజ్యాధి

కారంలో వున్నది. ఆ రాజ్యాధికారాన్ని ఒకవైపున ప్రజలకు వ్యతిరేకంగానూ, మరొకవైపున సామ్రాజ్యవాదులతోనూ, బడా భూస్వామిక వర్గంతోనూ బేరాలాడటానికి, రాజీపడటానికిగానూ ఆవిధంగా తన వర్గ స్థానాన్ని విపరీతంగా బలపర్చుకోటానికి వుపయోగిస్తున్నది. ఆ విధంగా వారు పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాలో సాగిపోతున్నారు. గత రెండు దశాబ్దాల కాలంలోనూ మనదేశంలో భారతీయ గుత్తపెట్టుబడి విపరీతంగా పెరిగింది; పెట్టుబడిదారీ విధానం బలపడింది. పరిస్థితి ఈ విధంగా వుండగా మన దేశానికి పెట్టుబడిదారీయేతరమైన అభివృద్ధి పంథానుగూర్చి మాట్లాడడంగాని, అటువంటి లక్ష్యాన్ని సాధించటానికి జాతీయ ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పర్చాలని అనడంగాని పూర్తిగా అవాస్తవికమౌతుంది ఆఖరుకు, సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడిని పూర్తిగా ఊడబెరకడం, మన వ్యవసాయాన్ని బంధించివున్న ఫ్యూడల్, అర్థఫ్యూడల్ శృంఖలాలను త్రెంచివేయడం అన్న మూల ప్రజాతంత్ర కర్తవ్యాలను నెరవేర్చటంకూడా బడా బూర్జువావర్గం నాయకత్వాన వున్న బూర్జువా - భూస్వామిక ప్రభుత్వాన్ని అధికారంనుండి తొలగదోయనిదే సాధ్యంకాదు.

(92) ఇటువంటి కర్తవ్యాలు తన ముందున్నవి కాబట్టి కమ్యూనిస్టుపార్టీ ప్రస్తుత ప్రభుత్వం తెచ్చిపెట్టిన ప్రతిష్టంభననుండి బైటపడటానికి ఒకేఒక సరైన మార్గంగా ఆచరణ సాధ్యమైన కర్తవ్యాలనూ, రాజకీయ కార్యక్రమాన్నీ మన ప్రజల ముందుంచుచున్నది.

భారతదేశంలో సోషలిజాన్నీ, కమ్యూనిజాన్నీ నిర్మించాలన్నే లక్ష్యంకొరకు కమ్యూనిస్టుపార్టీ గట్టిగా నిలబడుతుంది. ప్రస్తుతపు పరిపాలకవర్గంయొక్క బడా బూర్జువా నాయకులూ, ప్రభుత్వమూ భారతదేశంలో సోషలిజాన్ని నిర్మించటానికి దృఢసంకల్పంతో వున్నట్లు చెప్పే

బూటకపు కబుర్లకు భారతకమ్యూనిస్టుపార్టీ మోసపోదు. సమాజంలో వున్న ప్రధాన వుత్పత్తి సాధనాలన్నీ ప్రభుత్వ పరమైనప్పుడే, "శక్తి కొలదీ పని, అవుసరంకొద్దీ అనుభవం అన్న సూత్రం ప్రకారం కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మిస్తానికి దారితీసే విధంగా "శక్తికొలదీ పని, పని కొద్దీ ఫలితం" అన్న సూత్రంపైని మాత్రమే నిజమైన, నికార్సయిన సోషలిజాన్ని నిర్మించడం సాధ్యం అవుతుందన్నది అందరికీ తెలిసిన సామాన్య విషయమే. ఇటువంటి వ్యవస్థ ప్రస్తుతం వున్నటువంటి రాజ్యాంగ యంత్రంక్రింద, బడా బూర్జువావర్గ ప్రతినిధుల నాయకత్వాన వున్న బూర్జువా-భూస్వామిక ప్రభుత్వంవల్ల సాధింపబడదనేది స్పష్టమే. నిజమైన సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం శ్రామికవర్గ ప్రభుత్వం వల్లనే సాధ్యమౌతుంది.

ఇటువంటి సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికి భారత కమ్యూనిస్టు పార్టీ కట్టుబడివుంటూనే, దేశంయొక్క ఆర్థికాభివృద్ధి స్థాయినీ, కార్మిక వర్గంయొక్క, దాని సంస్థలయొక్క సిద్ధాంత - రాజకీయ పరిపక్వతనూ, దృష్టిలో పెట్టుకొని, ప్రజాప్రజాతంత్ర ప్రభుత్వ స్థాపన తక్షణ లక్ష్యంగా ప్రజల ముందుంచుచున్నది. ఇట్టి ప్రభుత్వం దేశంలోవున్న నిజమైన సమస్త ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నింటి యొక్క కూటమిగా వుంటుంది. ఈ కూటమిలో కార్మికవర్గం నాయకత్వం వహిస్తుంది. ఇందుకుగాను మొట్టమొదటగా ప్రస్తుతంవున్న బూర్జువా - భూస్వామిక రాజ్యాంగయంత్రం మారాలి, ప్రభుత్వం పోవాలి. వీటి స్థానే, శ్రామిక ప్రజల రాజ్యాంగయంత్రం ఏర్పడాలి; కార్మికవర్గ నాయకత్వంక్రింద ప్రభుత్వం ఏర్పడాలి; ఇటువంటి కూటమికి దృఢమైన కార్మిక - కర్షక మైత్రి పునాదిగా వుంటుంది. ఇదొక్కటే, మన భారత దేశపు విప్లవంయొక్క అసంపూర్ణ మౌలిక ప్రజాతంత్ర కర్తవ్యాల నన్నిటినీ సంపూర్ణంగా పూర్తిచేసి, సోషలిస్టుపధాన దేశాన్ని నడిపిస్తానికి

మార్గాన్ని ఏర్పరుస్తుంది. సోషలిజాన్ని నిర్మిస్తానికి అవుసరమైన తొలి చర్యలుగా ప్రజా ప్రజాతంత్ర ప్రభుత్వం నిర్వహించవలసిన కర్తవ్యాలూ, కార్యక్రమమూ ఇవి :

# రాజ్యాంగయంత్రి నిర్మాణంలో

(93) i ప్రజలకే సర్వంసహాధికారాలు వుంటాయి. దామాషా ప్రాతినిధ్యం పద్ధతి ఓటర్లలో అధిక సంఖ్యాకులు కోరినప్పుడు రాజీనామా చేయించే పద్ధతి ప్రకారం ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులకే దేశంలోని అత్యంత ఉన్నతాధికారం యావత్తూ దఖలుపడి వుంటుంది.

ii పార్లమెంటుకూ, రాష్ట్ర శాసనసభలకూ స్థానిక ప్రభుత్వ సంస్థలకూ ఎన్నికలన్నింటిలోనూ 18 ఏండ్లు దాటిన ప్రతి స్త్రీ పురుషునికీ ఓటింగుహక్కు వుంటుంది. ఎన్నికలు సూటియైన పద్ధతిలో వయోజన ఓటింగు పద్ధతిపై సమానహక్కు ప్రాతిపదికపై జరుగుతాయి. ఎన్నికలన్నీ రహస్యంగా జరుగుతాయి. ఏ ఓటరైనా ఏ స్థానానికైనా ఎన్నుకోబడే హక్కు వుంటుంది.

iii ఇండియన్ ఫెడరేషన్‌లోవుండే వివిధ రాష్ట్రాలకూ విస్తృతమైన స్వపరిపాలనాధికారాలు వుంటాయి.

iv రాష్ట్రాలకు గవర్నర్లు వుండరు. శాసనమండలి అనేది వుండదు. కేంద్రంలో రాజ్యసభకూ లోక్‌సభకూ సమానాధికారాలు వుంటాయి. ఈ రెండు సభల నిర్ణయాల మేరకే రిపబ్లికు అధ్యక్షుడు పనిచేస్తూ వుంటాడు కాని ఆయనకు వేరే ఇతర అధికారాలేమీ వుండవు.

v ఆదిమ జాతుల ప్రాంతాలకూ, లేదా, ఏదో వొక రాష్ట్రంలో ఒక నిర్దిష్టమైన ప్రాంతంలో నిర్దిష్టమైన సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులు, సాంప్రదాయాలూ కల్గిన జనసముదాయం నివసిస్తూవుంటుంటే అటువంటి ప్రాంతాలకూ ప్రాంతీయ స్వపరిపాలనాధికారం వుంటుంది; ఆ ప్రాంతాలలో ప్రాంతీయ ప్రభుత్వాలు ఏర్పడుతాయి. తమ అభివృద్ధికి గానీ, తమ పూర్తి స్వపరిపాలనాధికారానికిగానీ ఇతర రాష్ట్రాలవలెనే ఇవికూడా పూర్తి సహాయాన్ని పొందుతాయి.

vi భాషాప్రాతిపదికపై రాష్ట్రాలు పునర్విభజనచేసే కార్యక్రమాన్ని సంపూర్ణంగా నిర్వహించడం; అన్ని రాష్ట్రాలకూ సమానాధికారాలు.

vii స్థానిక స్వపరిపాలన విషయంలో గ్రామాలనుండి పైవరకూ ప్రజలతోనే నేరుగా ఎన్నుకోబడిన స్థానిక సంస్థలు ఏర్పడాలి; వీటికి నిజమైన అధికారాలూ, బాధ్యతలూ వప్పగించబడాలి; తగినంత ఆర్థిక స్తోమత కల్గించాలి.

viii మన సంస్థలన్నీ ప్రజాతంత్ర భావాలను జీర్ణం చేసుకొని వుండాలి. ప్రజలపై గౌరవంకల్గి, ఆధారపడి వుండాలి బూరాక్రసీ, అన్యాయములకు దూరంగావుండీ ప్రజాతంత్రసమాజాన్ని నిర్మించటానికి దృఢనిశ్చయంతో, విశ్వాసం కల్గివుండాలి.

కాబట్టి, జాతీయ జీవనంయొక్క ప్రతిరంగంపైనా ప్రజాతంత్రయుతమైన చొరవ, కంట్రోలు విస్తరింపజేయునట్లుగా ప్రజా ప్రజాతంత్ర ప్రభుత్వం చూస్తుంది. ఈ కర్తవ్య నిర్వహణలో ట్రేడ్ యూనియన్లు, శ్రామిక ప్రజల ఇతర సంస్థలూ కీలకమైన పాత్రను నిర్వహిస్తాయి.

శాసనసభలు, పరిపాలనా యంత్రాంగం మున్నగునవన్నీ ప్రజల ప్రజాతంత్ర కోర్కెలకు సర్వదా తలయొగ్గునట్లుగానూ, దేశపరిపాలనలోనూ, నిర్వహణలోనూ ప్రజాసామాన్యమూ, వారి సంఘాలూ చురుకైన పాత్ర వహించేటట్లుగానూ ప్రభుత్వం చూస్తుంది. పరిపాలనా యంత్రాంగమంతా నిరంకుశోద్యోగులతో నింపబడటాన్ని అంతంజేస్తుంది.

ix వ్యక్తి భద్రత, నివాసభద్రత రక్షించబడుతాయి. భావ, మతభావాలకూ, ఇష్టదైవములపూజకు, వాక్సభా పత్రికా ప్రచారములకూ, సంఘాల నేర్పర్చు కొనుటకూ, సమ్మె జేయుటకూ, ప్రయాణస్వేచ్ఛకూ, ఇష్టంవచ్చిన వృత్తిని సాగించుటకూ నిర్నిబంధమైన స్వేచ్ఛ వుంటుంది.

x (అ) ఉరిశిక్ష విచారణ లేకుండా డిటెన్షనులో పెట్టడం రద్దు చేయబడుతాయి.

(ఆ) కుల, మత, వర్ణజాతి, లింగభేదముల ప్రసక్తి లేకుండా పౌరులందరికీ సమాన హక్కులు వుంటాయి; స్త్రీ పురుషులకు సమాన పనికి సమాన వేతనాలు వుంటాయి.

(ఇ) స్త్రీలకున్న సాంఘిక అనర్హతలు తొలగించబడుతాయి; ఆస్తివారసత్వం, వివాహం, విడాకుల చట్టాల నమలుపర్చడం, ఉద్యోగాలలో ప్రవేశార్హత మున్నగు వాటిలో పురుషులతోబాటు సమానాధికారాలుంటాయి.

(ఈ) ఒక కులం మరొక కులాన్ని సాంఘికంగా అణచి వుంచటాన్ని రద్దుచేస్తుంది.

# మతరీత్యా అల్పసంఖ్యాకులగు వారికి వివక్షతనుండి రక్షణ కల్పించబడుతుంది

(94) i ప్రజలకు వారి వారి మాతృభాషలలోనే విద్యాబోధన జరుగుతుంది; ప్రభుత్వ సంస్థలలోనూ, పబ్లిక్ సంస్థలలోనూ, ఆ రాష్ట్రీ జాతీయ భాషయే పరిపాలనా భాషగా వుంటుంది; ఉన్నత తరగతులవరకూ విద్యాలయాలలో బోధనా భాషగాకూడా ఈ భాషే వుంటుంది. అవసరమైనచోట్ల, ఒక ప్రాంతంయొక్కగాని, ఒక అల్పసంఖ్యాక వర్గంయొక్కగాని భాషకూడా ఆ రాష్ట్రీ జాతీయభాషతో బాటుగా వుపయోగింపబడుతుంది. అఖిలభారత భాషగా హిందీని నిర్బంధం చేయడం జరగదు కాని వివిధ రాష్ట్రాలమధ్య అన్యోన్య సంపర్కము కొరకు భాషగా వుపయోగింపబడుతుంది. పార్లమెంటు లోనూ, కేంద్రప్రభుత్వ పరిపాలనలలోనూ అన్ని జాతీయ భాషల సమానత్వం గుర్తించబడుతుంది. పార్లమెంటు సభ్యులు ఏ జాతీయ భాషలోనైనా మాట్లాడటానికి హక్కు వుంటుంది. ఆ వుపన్యాసం వెను వెంటనే ఏక కాలంలో అన్ని భాషలలోకి తర్జుమా చేయబడుతుంది. ముఖ్యమైన అన్ని చట్టాలు, ప్రభుత్వపు టాజ్ఞలు, తీర్మానాలు అన్ని జాతీయ భాషలలోనూ ప్రచురింపబడగలవు. ఉర్దూ భాషకు, ఉర్దూ లిపికి రక్షణ యివ్వబడుతుంది.

ii —ఆదిమ జాతులతోసహా ప్రతిజాతి తమ ప్రత్యేక పద్ధతిలో అదే సమయంలో మొత్తం దేశమందలి ప్రజాతంత్ర ప్రజల సమిష్టి ఆశయాల కనుగుణ్యమైన పద్ధతిలో అభివృద్ధి చెందుటకు తోడ్పడేటటు వంటి;

— తమ జీవన పరిస్థితులను బాగుపర్చటానికీ, తమ జీవితాన్ని సుఖప్రదం చేసుకోవటానికి జరిగే పోరాటంలో ప్రజాస్వామిక ప్రజలకు తోడ్పడే టటువంటీ;

—కుల మత ద్వేషాలనూ, మూఢనమ్మకాలూ, మౌఢ్యాలనూ ప్రజలు పోగొట్టుకొనేందుకు తోడ్పడేటటువంటీ

—అన్నిదేశాల శాంతికాముకప్రజలతో సౌహార్ద్ర భావాలను పెంపొందించుకోవటానికీ, జాతి, రంగు భేదాలను నిరుత్సాహ పర్చటానికి ప్రజలందరికీ తోడ్పడేటటువంటీ;

సాహిత్యం, కళలు, సారస్వతం, సంస్కృతులను పెంపొందించి, ఉత్సాహపర్చి, అభివృద్ధి పచ్చుటకు చర్యలు తీసుకొంటుంది.

iii న్యాయస్థానంముందు ఏ అధికారి మీదనైనా కేసు పెట్టుటకు ఏ వ్యక్తికైనా హక్కు వుంటుంది.

రాజ్యాంగానికి ఏ మత సంస్థకూ పొత్తువుండదు. రాజ్యాంగం యొక్క లౌకిక స్వభావం గ్యారంటీ చేయబడుతుంది. రాజ్యాంగ వ్యవహారాల్లోనూ, రాజకీయ జీవితంలోనూ మతైక సంస్థలజోక్యం నిషేధించబడుతుంది;

—ఉన్నత విద్యదశవరకు ఉచిత నిర్బంధ విద్యా విధానం ప్రవేశపెట్టబడుతుంది.

—శ్రామిక ప్రజలకొరకు ఉచిత ఆరోగ్య, వైద్య, ప్రసూతి కేంద్రాలు నెలకొల్పబడతాయి. అలాగే విశ్రాంతి గృహాలు, క్రీడా మందిరాలు నెలకొల్ప బడతాయి.

iv న్యాయ పరిపాలనలో ప్రజాస్వామ్య మార్పులు తీసుకు రాబడతాయి. కార్యవర్గంనుండి న్యాయశాఖ పూర్తిగా వేరుచేయబడుతుంది. పార్లమెంటు, శాసనసభల లేక వివిధ స్థాయిలలోగల ప్రజాప్రతినిధులు సభల ఆమోదంతో న్యాయమూర్తుల నియామకం జరుగుతుంది.

—అందరికీ లీగలు సహాయం అందుబాటులోకి తేవడంకొరకు, అవుసరమున్నవారందరికీ ఉచిత సహాయం, సలహా యివ్వబడుతోంది.

v పరిశ్రమల్లోనూ, వ్యవసాయంలోనూ వ్యాపారంలోనూ అంచల వారీ పన్ను Graded Tax ప్రవేశపెట్టబడుతుంది. కార్మికులకు, రైతాంగానికి, చేతివృత్తులు చేసేవారికి సాధ్యమయినంతవరకు పన్ను భారం తగ్గించబడుతుంది. లాభాలు కంట్రోలు చేయబడతాయి, ఆదాయాలకు గరిష్ట పరిమితి నిర్ణయించబడుతుంది.

vi సాయుధ బలాల్లో దేశభక్తిని, ప్రజాస్వామ్యాన్ని ప్రజాతంత్ర ప్రభుత్వం రగుల్కొల్పుతుంది. వారికి మంచి జీవన ప్రమాణ స్థాయిని, వారి పని విధానంలో మంచి మార్పులను తేవడానికి హామీ యిస్తుంది. అలాగే వారి సాంస్కృతాభివృద్ధికి మంచి అవకాశాలు కల్పించబడతాయి. వారి పిల్లల క్షేమానికి, వారికి విద్యా సదుపాయాలు కల్పించుతుంది.

vii వివిధ రాష్ట్రాలమధ్య సహకారాన్ని పెంపొందించడానికి, దృఢతరం చేయడానికి, భిన్న రాష్ట్ర ప్రజల మధ్య ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సంబంధాలను పెంపొందించడానికి తద్వారా భారతదేశ సమైక్యతను మరింత దృఢతరం చేయడానికి ప్రజాప్రజాతంత్ర ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకుంటుంది. ఆర్థికంగా వెనుకబడిన, బలహీనమైన రాష్ట్రాలకు, ప్రాంతాలకు, స్వల్పప్రాంతాలకు, వాటి వెనుకబాటుతనం

నుండి బయటపడటానికి యీ ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించి ఆర్థిక, తదితర సహాయాన్ని చేస్తుంది.

# వ్యవసాయ రైతాంగ రంగంలో

**(95)** మన జాతీయ జీవితంలో వ్యవసాయ రైతాంగ సమస్యలు ప్రపథమ స్థానం వహిస్తాయి.

**(96)** బీదరైతాంగానికి భూమిలేని కారణంగానూ, ప్రాధమికమైన వ్యవసాయ పనిముట్లు, వ్యవసాయాభివృద్ధికి కావలసిన ఎరువులు కొనలేని కారణంగాను, మన వ్యవసాయాన్ని గణనీయ స్థాయిలో అభివృద్ధి పరచలేక పోతున్నాము. దేశానికి కావలసిన ఆహారాన్ని, ముడి పదార్థాలను సప్లయి చేయలేకపోతున్నాము.

**(97)** నూటికి 80 మంది రైతాంగం ఉత్పత్తి చేయబడిన వస్తువుల్లో కనీస భాగంకూడా కొనజాలని పరిస్థితి మూలంగా జాతీయ పరిశ్రమల నభివృద్ధిపరచి, దేశంలో పెద్ద ఎత్తున పారిశ్రామికీకరణ చేయజాలకపోతున్నాము.

**(98)** వేలాది ఆకలిగొన్న బీదప్రజలు దారిద్ర్యం మూలంగా గ్రామాలు వదలి పట్టణాల కెగబ్రాకుతున్నారు. తత్ఫలితంగా 'లేబరు మార్కెటు'లో జనాభా పెరిగి, నిరుద్యోగం హెచ్చి, కూలిరేటు తగ్గిపోతున్నది. ఈ కారణంగా మన కార్మికవర్గ పరిస్థితిని మెరుగు పర్చలేకపోతున్నాము.

**(99)** జనాభాలో మెజారిటీగావున్న బీద, ఆకలిగొన్న రైతాంగం

తమ బిడ్డలకు చదువు చెప్పించే భౌతిక పరిస్థితిలేని కారణంగా, మన సాంస్కృతిక వెనుకబాటు తనంనుండి త్వరలో బయట పడలేకున్నాము.

(100) ఈ దుష్టావశేషాలనుండి బయటపడి, రైతాంగానికి మానవతా పరిస్థితులు ఏర్పడటానికి యీచర్యలు తీసుకోవడం అవుసరం.

i భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి వ్యవసాయ కార్మికులకు, బీద రైతాంగానికి ఉచితంగా భూమి నివ్వాలి.

ii రైతులకు, చేతి వృత్తులుచేసే వారికి దీర్ఘకాల ఋణాలను తక్కువ వడ్డీకి యివ్వాలి. వ్యవసాయోత్పత్తి సరుకుకు సరియైన ధర లుండేటట్లు హామీ యివ్వాలి.

iii వడ్డీవ్యాపారులకు, భూస్వాములకు రైతాంగం, వ్యవసాయ కార్మికులు, చిన్నచేతి పనివారు యివ్వవలసిన బాకీలను రద్దుచేయాలి.

iv వ్యవసాయ కార్మికులకు సరియైన వేతనాలు, జీవన పరిస్థితులు వుండేటట్లు చూడాలి.

v వ్యవసాయానికి, తదితర పనులకు, రైతు - చేతి పనివారి సహకార సంస్థలను ఐచ్ఛికంగా ఏర్పరచడానికి హామీ యివ్వాలి.

vi ఆధునిక పనిముట్లను, టెక్నిక్‌ను, ఉత్తమ తరగతి విత్తనాలను వినియోగించి వ్యవసాయ పద్ధతులను మెరుగు పర్చడంలో రైతాంగానికి సహాయపడాలి.

## పరిశ్రమలు : కార్మికులు

(101) మన రైతాంగంయొక్క కొనుగోలుశక్తి మిక్కిలి హీనంగా వుండటం వల్లనేగాక విదేశీపెట్టుబడుల దాడులవల్లకూడా మన

పరిశ్రమలు దెబ్బతింటున్నవి. విస్తృత పారిశ్రామికాభివృద్ధి జరిగి తేనేగాని మనదేశం సంపన్నమైనదిగానూ, బలమైనదిగానూ కాలేదు. అయితే, బ్రిటిషు పెట్టుబడి, ఇతర విదేశీపెట్టుబడి మనదేశంలో వున్నంత కాలం, మరింతగా చొచ్చుకు వస్తానికి మరిన్ని అవకాశాలు కల్పించ బడుతూ వున్నంతకాలం మనదేశం మనం కోరుకొనేటంతగా పారిశ్రామికంగా బలపడలేదు. ఎందువల్లనంటే, ఈ బ్రిటిషు, తదితర పెట్టుబడిదార్ల పెట్టుబడిపైన వచ్చేలాభాలను వారు మన దేశంనుండి బైటకి తరలించుకు పోతారు; మనమేమో వాటిని వుపయోగించుకోలేము.

కాబట్టి ప్రజా ప్రజాతంత్ర ప్రభుత్వం పారిశ్రామిక రంగంలో ఈ కర్తవ్యాలను నెరవేరుస్తుంది.

1. తోటలు, గనులు, నూనె శుద్ధికర్మాగారాలు, ఫ్యాక్టరీలు, షిప్పింగు, వ్యాపారములలోవున్న విదేశీ పెట్టుబడినంతటినీ స్వాధీనం చేసుకొంటుంది. బ్యాంకులు, పరపతి సంస్థలు, ఇతర గుత్తపారిశ్రామిక సంస్థలనూ జాతిపరం చేస్తుంది. విదేశీ వ్యాపారాన్ని జాతిపరం చేస్తుంది.

2. మన పారిశ్రామిక బలహీనతనూ త్వరగా అధిగమించి, మన దేశ పరిశ్రమలను సదాపెంచుకొంటూ పోవటానికిగాను ప్రభుత్వ రంగాన్ని అతి వేగంగా అభివృద్ధి చేయాలి. కొత్త ప్రభుత్వ పరిశ్రమలను నెలకొల్పటంతో కలిసి ఈ ప్రభుత్వరంగం అభివృద్ధి ప్రభుత్వ రంగానికి పైచేయిని సాధించగలదు; నిర్ణయాత్మక పాత్ర వహించేటట్లు చేయగలదు.

3. పరపతిని కల్గించడంద్వారా, చవుకగా ముడిసరుకులనుసప్లయి చేయడంద్వారా, మార్కెటు సౌకర్యాలను కల్గజేయడంద్వారా చిన్న పరిశ్రమలకూ, మధ్యరకం పరిశ్రమలకూ సహాయం చేస్తుంది.

4. ప్రజల ప్రయోజనాలకు అనుగుణ్యంగా, దేశపారిశ్రామికాభివృద్ధిని సమతూకంగా, ప్రణాళికాబద్ధంగా సాధించుటకుగాను మన ఆర్థిక రంగంలోని వివిధ భాగాలను రెగ్యులేటుచేసి, వాటి మధ్య సమన్వయం కుదుర్చుతుంది.

5. ప్రభుత్వరంగంయొక్క మేనేజిమెంటును ప్రజాతంత్రయుతం చేస్తుంది. ఇందుకై బడాపెట్టుబడిదార్లతో సంబంధాలున్న వుద్యోగులను తొలగిస్తుంది; పరిశ్రమల నిర్వహణలోనూ, మేనేజిమెంటులోనూ కార్మికులూ, టెక్నిషియన్లు నిర్మాణాత్మకమైన పాత్రవ దీసుకొనేటట్లు చేస్తుంది.

6. కార్మికుల జీవనస్థాయినీ, పని పరిస్థితులనూ రాడికల్‌గా మెరుగు పరుస్తుంది. ఇందుకై (అ) జీవనభృతిని ఏర్పరుస్తుంది. (ఆ) పనిగంటలను క్రమంగా తగ్గిస్తుంది. (ఇ) నిరుద్యోగంనుండీ, అపాయాలనుండీ రక్షణకుగాను ప్రభుత్వ ఖర్చుపైనా, పెట్టుబడిదార్ల ఖర్చుపైనా సాంఘిక భీమాపద్ధతిని ఏర్పరుస్తుంది. (ఈ) కార్మికులకు సుఖప్రదమైన ఇండ్లవసతిని కల్పిస్తుంది. (ఉ) ట్రేడ్‌యూనియన్లనుగుర్తిస్తుంది. సమిష్టి అగ్రిమెంట్లనూ, సమ్మె హక్కునూ అంగీకరిస్తుంది.

7. సామాన్య ప్రజల కనుగుణ్యమైన ధరల విధానాన్ని సమర్థవంతంగా అమలు జరుపుతుంది.

## విదేశాంగ విధానంలో

(102) ప్రపంచ శాంతిని పరిరక్షించడంలోనూ, శాంతియుత సహజీవనాన్ని పెంపొందించడంలోను, వలస విధానానికి వ్యతిరేకంగా నిలబడడంలోనూ భారతదేశం తనసముచిత పాత్రను నిర్వహించటానికై ప్రజా ప్రజాతంత్ర ప్రభుత్వం ఈ క్రింది చర్యలు తీసుకొంటుంది:

—అణుబాంబులయుద్ధ ప్రమాదాన్నుండీ మానవాళిని రక్షించటానికై శాంతికాముక శక్తులన్నింటితోనూ కలిసి శాయశక్తులా కృషిచేస్తుంది.

—అణుబాంబులయొక్క, జనబాహుళ్యాన్ని నాశనం జేస్తానికి వుపయోగపడే ఇతర ఆయుధాలయొక్క పరీక్షలపైనా, ఉత్పత్తిపైనా, ఉపయోగంపైనా వెంటనే నిషేధం పెట్టాలనీ, అణు, హైడ్రోజన్ బాంబులు నిల్వలన్నిటినీ ధ్వంసం చేయాలనీ, అణ్వస్త్రరహిత మండలాలను ఏర్పాటు చేయాలనీ కోరుతుంది.

—యుద్ధప్రమాద నివారణకు కృషిజేస్తుంది; శాంతిని కాపాడుటకూ దానిని గట్టి పర్చుటకూ పూనుకుంటుంది.

—పంచశీలములపై ఆధారపడి, విభిన్న సాంఘిక వ్యవస్థలుగల వివిధ దేశాలమధ్య శాంతియుత సహజీవనం నెలకొల్పటానికై కృషి జేస్తుంది. సార్వత్రిక, నియమబద్ధ నిరస్త్రీకరణ ఒడంబడికకు కృషి జేస్తుంది.

—శాంతి, స్వాతంత్ర్యముల ప్రయోజనాలదృష్ట్యా, అన్ని విధాల ఆఫ్రో - ఆశియా స్నేహసౌహార్ద్రతలను బలపరుస్తుంది; సోషలిస్టు దేశాలతోనూ, అన్ని శాంతికాముక దేశాలతోనూ స్నేహ, సహకారములను పెంపొందించుకొంటుంది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే వలస దేశాలప్రజల పోరాటాలకు సహాయపడుతుంది.

—అన్ని మిలిటరీ ఒడంబడికలనూ, విదేశాలలో నిర్మించిన అన్ని మిలిటరీస్థావరాలనూ రద్దుచేయమనీ, ఇతరదేశాలలోవున్న విదేశీ సైన్యాలనన్నిటినీ వుపసంహరించాలనీ కోరుతుంది.

—సామ్రాజ్యవాద యుద్ధోన్మాదులగూర్చి మిక్కిలి జాగరూకతతో వుంటూ, వారి కుట్రలనూ, కుహూకాలనూ కనిపెట్టుతూవుంటుంది; ఈ విషయంపై ప్రజల చైతన్యాన్ని పెంపొందిస్తుంది.

—బ్రిటిషుకామన్వెల్తునుండి దేశాన్ని వుపసంహరిస్తుంది: మన జాతి ప్రయోజనాలకుగాని, జాతిగౌరవప్రతిష్ఠలకుగాని భంగకరంగా బ్రిటన్, అమెరికాలతోవుండే ఒడంబడికలనూ, ఒప్పందాలనూ రద్దు చేస్తుంది.

మనదేశం పొరుగుదేశాలైన పాకిస్థాన్, నేపాల్, సిలోన్, బర్మా, చైనాలతోవుండే విభేదాలనూ, తగాదాలనూ పంచశీలముల ప్రాతిపదికపై శాంతియుతంగా పరిష్కరించుకొనటానికీ, స్నేహసంబంధాలను ఏర్పర్చుకొనటానికీ ప్రత్యేకమైన, దృఢమైన ప్రయత్నాలను గావిస్తుంది.

# XI

# ప్రజా ప్రజాతంత్ర సంఘటన నిర్మాణం

(103) ప్రస్తుతదశలో, భారతదేశ విప్లవంయొక్క మూలకర్తవ్యాలను సంపూర్ణంగా, నిశ్శేషంగా పూర్తిచేయాలంటే బడాబూర్జువావర్గం నాయకత్వానవున్న ప్రస్తుతపు బూర్జువా-భూస్వామిక ప్రభుత్వాన్ని తొలగద్రోసి కార్మికవర్గ నాయకత్వంక్రిందవుండే ప్రజా ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పర్చాలనేది స్పష్టం.

(104) భూస్వామిక విధానంతో రాజీపడిన బడాబూర్జువా నాయకత్వాన్ని ప్రభుత్వాధికారంలో నాయకత్వపు స్థానంనుండి తొలగించి, ఆ స్థానంలో కార్మికవర్గనాయకత్వం ఏర్పర్చనిదే రైతాంగ ప్రయోజ

నాలకు పుపకరించే నిజమైన వ్యావసాయిక సంస్కరణలు ఏవీ చేయబడ జాలవు. అటువంటి సంస్కరణలు జరిగినప్పుడే కరువుకాటకాలకు గురియయ్యే మనప్రజలకు చాలినంత ఆహారాన్ని అందించగల్గుతాము: మన పారిశ్రామికవస్తువులను ముడిసరుకులనూ, విస్తృతమైన మార్కెటునూ సమకూర్చగల్గుతాము; దేశాభివృద్ధికి అవుసరమైన అదనపుపెట్టుబడిని సంపాదించుకోగల్గుతాము.

(105) విదేశీసామ్రాజ్యవాద పెట్టుబడితో రాజీపడుతూ, సమాధానపడుతూవుండే పాలసీలనవలంబించే ప్రస్తుతప్రభుత్వం పరిపాలన సాగుతూ వున్నంతకాలం విదేశీ గుత్తపెట్టుబడినుండీ, దాని విపరీత దోపిడినుండి మన ఆర్థికవిధానం తప్పించుకోలేదనేది స్పష్టం. మనదేశం నుండి విదేశీ గుత్తపెట్టుబడిని మూటాముల్లెతో వెళ్ళగొట్టాలంటే, మన దేశ స్వాతంత్ర్యం దృఢమైన, బలమైన పునాదిపై నిల్వాలంటే కార్మికవర్గనాయకత్వాన ఏర్పడే ప్రజా ప్రజాతంత్ర సంఘటనయొక్క ప్రభుత్వస్థాపన ఒక్కటే గ్యారంటీ.

(106) అన్నిటికన్న అంతకంతకూ కొట్టవచ్చినట్లు కన్పడేది ఒకటివుంది. ప్రజావ్యతిరేక విధానాల నవలంబిస్తూవుండే ప్రస్తుత ప్రభుత్వాన్ని సంపూర్ణంగా ఓడించి, దానిస్థానే ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర విధానాల నవలంబించే ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పర్చినప్పుడుగాని మనప్రజలు చారిత్రకంగా బూజుపట్టిపోయిన అతిబాధాకరమైన పెట్టుబడిదారీ అభివృద్ధిపంధాను తప్పించుకోజాలరు: గుత్తపెట్టుబడిదారీవిధానం పెరగటం ఈ అభివృద్ధిపంథావల్లనే జరుగుతూవున్నది: అటువంటి గుత్తపెట్టుబడిదారీ పిడివిధానపు పిడికిలినుండి మన ప్రజలు విముక్తిపొందజాలరు.

(107) మన విప్లవంయొక్కదశ, దానినెదుర్కొనే కర్తవ్యాలూ ఆ విప్లవంయొక్క స్వభావాన్నేగాక ఆ విప్లవాన్ని జయప్రదంచేయడానికి సాగించేపోరాటంలో వివిధవర్గాలు వహించేపాత్రనుకూడా నిర్ణయిస్తాయి. మన విప్లవంయొక్క నేటిదశలో ప్రప్రధానంగా ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాదవ్యతిరేక, ప్రజాతంత్ర స్వభావాన్ని కలిగివుంటుంది. అయితే, వివిధదేశాలలో ప్రజాతంత్ర విప్లవాలకు బూర్జువావర్గం నాయకత్వం వహిస్తూవుండేకాలంలో సాంప్రదాయకంగా ఈ పదవికి ఏర్పడిన అర్ధంలోకాదు మనం ప్రజాతంత్రవిప్లవం అనేది. మనంసాగించే ప్రజాతంత్రవిప్లవం, ప్రపంచచరిత్రలోనే ఒక నూతనశకం ఏర్పడినకాలంలో సాగేది; బూర్జువావర్గం నాయకత్వంవహించి, మధ్యలో ఈ విప్లవానికి ద్రోహంచేసేవిధంగాగాక, ఈ విప్లవానికి శ్రామికవర్గమూ, దాని రాజకీయపార్టీ నాయకత్వం వహించ నిర్ణీతమైవున్నది. సోషలిజానికి పోవటానికై తప్పనిసరియైనమెట్టుగా ప్రస్తుతశకంలో శ్రామికవర్గమే ప్రజాతంత్ర విప్లవానికి నాయకత్వంవహించవలసివున్నది. కాబట్టి మనవిప్లవం బూర్జువావర్గ నాయకత్వాన నడపబడే పాతనమూనా ప్రజాతంత్రవిప్లవం కాక, శ్రామికవర్గంచే సంఘటితపర్చబడి నడపబడే నూతన నమూనా ప్రజా ప్రజాతంత్రవిప్లవంగా వుంటుంది.

(108) వ్యవసాయంలోనూ, పరిశ్రమలలోనూ ఉత్పత్తిశక్తులకు సంకెళ్ళుగా తయారైన ఫ్యూడల్, అర్ధఫ్యూడల్ అవశేషాలను నిశ్శేషంగా తుడిచిపెట్టటానికిగాను, రైతాంగప్రయోజనాలకు వుపకరించే విధంగా రాడికల్ వ్యవసాయ సంస్కరణలను సాగించటమనే కర్తవ్యమే ఫ్యూడల్వ్యతిరేక, సామ్రాజ్యవాదవ్యతిరేక ప్రజా ప్రజాతంత్ర విప్లవం నిర్వహించవలసిన ప్రప్రధాన, ప్రథమకర్తవ్యం. వాస్తవానికి, ప్రజాతంత్ర విప్లవానికి ఇరుసువంటిది వ్యావసాయిక విప్లవం. దాని

యొక్క పూర్తిప్రాముఖ్యతనుగాని, అర్థాన్నిగాని సరిగా గ్రహించక పోవటమంటే ప్రజాతంత్ర విప్లవంయొక్క అసలు సారాంశాన్నే గ్రహించకపోవటమన్నమాట. ప్రజాతంత్రవిప్లవం నిర్వహించవలసిన రెండవతక్షణకర్తవ్యం, మనజాతీయ ఆర్థికరంగంనుండి విదేశీగుత్తపెట్టుబడిని పూర్తిగా రద్దుచేసి, మూటాముల్లెగట్టి సాగనంపటం: ఆ విధంగా ఆ విదేశీ గుత్తపెట్టుబడియొక్క వినాశనకరప్రభావంనుండి మనప్రజల ఆర్థిక, రాజకీయ, సాంఘికజీవితాన్ని విముక్తిచేయలేము.

(109) అయితే, రాజ్యాంగంలో నాయకత్వస్థానాలను ఆక్రమించుకొని కూర్చొన్న బడాబూర్జువావర్గానికీ దాని రాజకీయప్రతినిధులకూ వ్యతిరేకంగా ప్రతిఘటన జరపకుండా, గట్టిపోరాటాన్ని జరపకుండా ఈనాటి పరిస్థితులలో విప్లవంయొక్క మూల, ప్రాతిపదిక కర్తవ్యాలను నెరవేర్చటం అసాధ్యం. ఈ వర్గం, దాని రాజకీయ ప్రతినిధులూ నిజమైన, తీవ్రమైన వ్యావసాయిక సంస్కరణలను ఖచ్చితంగా వ్యతిరేకిస్తారు; తమ సంకుచితవర్గ ప్రయోజనాలకు వుపకరించేవిధంగా, తమవర్గ ప్రాబల్యాన్ని దఢపర్చుకొనేవిధంగా ఫ్యూడల్, అర్థఫ్యూడల్ భూస్వామికవిధానాన్ని సంస్కరించే పంథాను చేబట్టింది. అదేవిధంగా విదేశీ గుత్తపెట్టుబడి సంరక్షణకూ, అదే అడ్డు అదుపులులేకుండా దేశఆర్థికరంగంలోకి చొరుచుకువస్తానికీ తన ప్రభుత్వాధికారాన్ని వుపయోగిస్తున్నది. అంతేగాదు, విదేశీ గుత్తపెట్టుబడితో రాజీపడటం, సమాధానపడటం అనే పంథామూలంగానూ, బడాదేశీయ భూస్వామికవర్గాలతో చేతులుకల్పటం అనే పంథామూలంగానూ వారు మనదేశంలో పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాను గట్టిగా అనుసరిస్తున్నారు; ఇందుమూలంగా, గుత్తపెట్టుబడి మనదేశంలో మరింతగా పెరగటానికి దోహదం కల్గుచున్నది. కాబట్టి, ఫ్యూడల్, అర్థఫ్యూడల్ భూస్వామికవిధానంలోనూ, విదేశీ గుత్తపెట్టుబడి

లోనూ ప్రజా ప్రజాతంత్ర విప్లవం రాజీలేని ప్రతిఘటనను సాగించటమే గాక రాజ్యాంగాన్ని నడుపుతూ, విదేశీ గుత్తపెట్టుబడితో రాజీ, సమాధాన మార్గాలను అనుసరించే, దేశీయ భూస్వామికవర్గంతో చేతులుకల్పే పంథాను అనుసరించే బడాబూర్జువావర్గానికికూడా వ్యతిరేకంగా నిల బడుతుంది.

(110) కాబట్టి, ఇటువంటి పరిస్థితులలో ప్రజాప్రజాతంత్ర విప్లవం సహజంగానే భారతదేశపు బడాబూర్జువావర్గంయొక్క రాజ్యాధి కారంతో తప్పనిసరిగా తలపడవలసివస్తున్నది. కాబట్టి ఈ విప్లవాన్ని నిర్వహించటానికి ఏర్పడవలసిన ప్రజాప్రజాతంత్ర సంఘటన, మన జాతీయవిముక్తిపోరాటంయొక్క ప్రథమదశలో, అనగా, విదేశీ బ్రిటిషు సామ్రాజ్యవాదుల పరిపాలనకు వ్యతిరేకంగా పోరాటలక్ష్యం ఎక్కుబెట్ట బడి వున్నప్పటిదశలోవలె, సాధారణ జాతీయైక్యసంఘటనగా వుండ జాలదు. ఇది విప్లవంయొక్క ప్రజాతంత్ర వ్యవసాయికదశ; విప్లవాభి వృద్ధియొక్క ఈ దశలో నూతన పరస్పరవర్గ సంబంధాలు ఏర్పడి వున్నవి. కాబట్టి ఈ దశలో ఏర్పడవలసినట్టి ప్రజాతంత్ర సంఘటనకు నూతన స్వభావం ఏర్పడుతుంది.

(111) భారతకార్మికవర్గంయొక్క, దాని రాజకీయపార్టీయైన కమ్యూనిస్టుపార్టీయొక్క నాయకత్వంక్రింద తప్పితే ప్రజాప్రజాతంత్ర సంఘటనకు జయప్రదంగానిర్మించడంగాని, విప్లవవిజయాన్ని చేకూర్చ టంగాని సాధ్యంకాదు. ఆధునికసమాజంలో కార్మికవర్గం తప్పితే మరే వర్గమూ ఈ పాత్రను నిర్వహించజాలదని చరిత్ర రుజువుచేసింది. మన కాలంలో మనకుగల్గిన అనుభవంకూడా ఈ సత్యాన్నే ధృవపరుస్తున్నది.

(112) కార్మిక, కర్షకవర్గాల ధృఢమైనమైత్రియే ప్రజాప్రజా తంత్ర సంఘటనకు గుండెకాయగానూ, పునాదిగానూ వుంటుంది. ఈ

మైత్రియే జాతీయస్వాతంత్ర్యాన్ని సంరక్షించడంలోనూ, మిక్కిలి తీవ్రమైన ప్రజాతంత్ర పరివర్తనను సాధించడంలోనూ, సమగ్రమైన సాంఘికాభివృద్ధిని చేకూర్చడంలోనూ మిక్కిలి ప్రధానమైనశక్తిగా పనిచేస్తుంది. ఇంతేకాదు; ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాదవ్యతిరేక కర్తవ్యాలను పూర్తిచేయడంలో జాతీయబూర్జువా వర్గంలోని వివిధసెక్షన్లు ఎంతవరకూ పాల్గొంటాయి అనేదికూడా ఈ కార్మిక-కర్షకమైత్రియొక్కబలం, దారుఢ్యములమీదనే ఆధారపడివుంటుంది. క్లుప్తంగా చెప్పాలంటే, విప్లవాన్ని జయప్రదంగా సాగించటానికిగాను విశాలమైన ప్రజాప్రజాతంత్ర సంఘటనను నిర్మించడం, అభేద్యమైన కార్మిక కర్షకమైత్రిపైననే ఆధారపడి వుంటుంది.

**(113)** మన రైతాంగం ఏకాండమైనవర్గంకాదనీ, పెట్టుబడిదారీ విధానం మన రైతాంగ జీవనంలోకికూడా చొరబడి, వారిలో వివిధ తరగతులనూ ఏర్పర్చిందనే విషయం అందరికీ తెలిసినదే. రైతాంగంలోని ఈ వివిధతరగతులు విప్లవంలో వేర్వేరుపాత్రలను నిర్వహిస్తాయి. గ్రామీణకుటుంబాలలో 100 కి 70 వంతులుగావుంటూ, భూస్వాముల దోపిడికి విశేషంగా గురిఅవుతూ వుండే వ్యవసాయకార్మికులూ, పేద రైతులూ, ఈనాటి సామాజిక వ్యవస్థలో వర్గరీత్యా వారికిగల స్థానాన్నిబట్టే, కార్మికవర్గానికి ప్రప్రధాన మిత్రులుగా వుంటారు. మధ్యతరగతి రైతులుకూడా ప్రజాతంత్రసంఘటనలో కార్మికవర్గానికి మిత్రులుగా వుంటారు; ఎందువల్లనంటే వారు వడ్డీవ్యాపారుల దోపిడికి గురిచేయబడుతూ వున్నారు. గ్రామసీమలలో ఫ్యూడల్‌భూస్వాముల, పెట్టుబడిదారీ భూస్వాముల దోపిడీకికూడా గురిచేయబడుతూ వున్నారు. పెట్టుబడిదారీ మార్కెటులో దోచుకోబడుతూవున్నారు. గ్రామీణజీవితంపై భూస్వాములకున్న కబంధహస్తాలమూలంగా వారి సాంఘికజీవనం దెబ్బతింటూ వున్నది.

(114) రైతాంగంలో ధనికరైతులు మరొక పలుకుబడిగల్గిన భాగం. కాంగ్రెసు వ్యావసాయిక సంస్కరణల ఫలితంగా వారిలో కొంత మంది నిస్సందేహంగా లాభపడ్డారు. స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన నూతన ప్రభుత్వపరిపాలనలో వారు కొంతవరకూ బాగుపడ్డారు. పెట్టుబడి దారీ భూస్వాముల శ్రేణులలోకి జేరాలని వారు ఉబలాటపడుతున్నారు. తమ పొలాలలో వ్యవసాయకూలీలను పెట్టుకొనడంద్వారా వారంటే వ్యతిరేకం అయినప్పటికీ, అధికపన్నులు, పారిశ్రామిక వస్తువులకు అధికధరలు, నోట్లముమ్మరం వీరిని సదా వేధిస్తూ, వీరిజీవితాన్ని ఒడు దుడుకులలో పెడ్తాయి. విదేశీ, స్వదేశీ గుత్తపెట్టుబడిదార్ల పెత్తనం క్రిందవుండే మార్కెటులోవుండే దోపిడికి వీరు సదా గురియౌతూ, బూర్జువా - భూస్వామికప్రభుత్వంయొక్క దారుణమైన విధానాలవల్ల పీడించబడుతూ వుంటారు. కాబట్టి, చాలావరకూ వీరినికూడా ప్రజాప్రజా తంత్ర సంఘటనలోకి తీసుకురావచ్చును. ప్రజా ప్రజాతంత్ర విప్లవంలో మిత్రులుగా వీరిని వుంచవచ్చును.

(115) చాలీచాలని జీతాలతోనూ, స్వల్పఇతర ఆదాయాలతోనూ సతమతమౌతూవుండే పట్టణ మధ్యతరగతి ప్రజలు, తదితర ప్రాంతాల లోని మధ్యతరగతి ప్రజలు బూర్జువా-భూస్వామిక పరిపాలనవల్లా, విదేశీ గుత్తపెట్టుబడితో రాజీపడుతూ, భూస్వామికవర్గంతో చేతులుకలుపుతూ, పెట్టుబడిదారీ అభివృద్ధిపంథాను అవలంబించే దాని విధానాలవల్లా బాధలు పడుచున్నారు. తిండి, బట్ట, ఇతర జీవితావసర వస్తువులధరలు రోజు రోజుకూ పెరుగుతూ వుండటంవల్లా, ఇండ్లకు హెచ్చుఅద్దెలు ఇవ్వ వలసి వుండటంవల్లా, పిల్లలచదువు మరింత వ్యయప్రయాసలతో కూడి వుండటంవల్లా, ప్రభుత్వం సదా విధించే ప్రత్యక్ష, పరోక్ష పన్నులభారం క్రింద నలిగిపోతూ వుండడంవల్లా, వారు మిక్కిలి బాధపడుతూవున్నారు. వారిని సదా వేధించేది నిరుద్యోగం ఒకటి. కాబట్టి, ప్రజాతంత్ర సంఘట

నలో ఈ వర్గం మిత్రుడుగా వుండగలదు; వుంటుందికూడా; విప్లవానికి ఈ వర్గాన్ని సుముఖం చేసుకొంటానికై అన్ని ప్రయత్నాలుచేసి తీరాలి.

(116) మన దేశంలాంటి బడుగుదేశాలలో, కొత్తగా విముక్తి పొందిన దేశంలోవుండే బూర్జువావర్గం ఒక వర్గంగా సామ్రాజ్యవాదం తోటీ, అర్ధఫ్యూడల్ భూస్వామిక విధానంతోటీ వైరుధ్యాలను, సంఘర్షణలనూ కల్గి వున్నది. అయితే ఈ బూర్జువా వర్గంలోని బడాసెక్షను, గుత్తపెట్టుబడి సెక్షను, స్వాతంత్ర్య సముపార్జన తర్వాత చేజిక్కిన రాజ్యాధికారాన్ని ఉపయోగించుకొని ఈ సంఘర్షణనూ, వైరుధ్యాలనూ రాజీద్వారా, ఒత్తిడిద్వారా, బేరసారాలద్వారా పరిష్కరించుకోవాలని చూస్తుంది. ఈ పరిణామ క్రమంలో ఈ సెక్షను విదేశీ గుత్తపెట్టుబడి దార్లతో బలమైన లింకులను ఏర్పర్చుకొంటూ వున్నది. భూస్వాములతో అధికారాన్ని పంచుకొంటున్నది. సోషలిస్టు ప్రపంచంనుండి వచ్చే సహాయాన్ని ఒక వైపున సామ్రాజ్యవాదులలో బేరాలాడటానికి వుపయోగిస్తూ, మరొకవైపున తన్ను తాను బలపర్చుకుంటానికి వుపయోగిస్తూ వుంటానికి వెనుదీయని ఈ సెక్షను, స్వభావరీత్యా ప్రజావ్యతిరేకమైనది, కమ్యూనిస్టు వ్యతిరేక మైనది. అది ప్రజల ప్రజాతంత్ర సంఘటనకూ పూర్తిగా వ్యతిరేకం; ఆ సంఘటన విప్లవ ఆశయాలకూ పూర్తిగా వ్యతిరేకం;

(117) విదేశ గుత్తపెట్టుబడిదార్లతో ఎలాంటి లింకులులేని, లేక, దృఢమైన లింకులు లేనట్టి జాతీయ బూర్జువావర్గంలోని ఇతర విస్తారమైన సెక్షన్లు, స్వయంగా గుత్తపెట్టుబడి స్వభావంకలవికావు; పైగా, ఇవే గుత్తపెట్టుబడివల్ల అనేక విధాలుగా బాధింపబడుతూ వుంటాయి.

కాబట్టి ఇటువంటి సెక్షన్లు ఫ్యూడల్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవంయొక్క ప్రధానకర్తవ్యాలను పూర్తిచేయడంలో వాస్తవరీత్యా ఆసక్తిని కలివున్నది. ప్రపంచ పెట్టుబడిదారీ విధానంలోని సర్వసమాన్య సంక్షోభం తీవ్రతరమైన కొలదీ, విదేశ గుత్తపెటుబడిదార్లకూ, తమకూ మధ్యవున్న వైరుధ్యాలు తీవ్రమైన కొలదీ, తనకున్న ఆర్థిక శక్తిని, ప్రభుత్వంలోని నాయకత్వ స్థానాన్ని ఆసరగా తీసుకొని ఈ సంక్షోభాన్ని దేశంలోని తనవర్గ సోదరులకు నష్టకరంగా పరిష్కరించ బూను కొన్నకొలదీ, బూర్జువావర్గంలోని ఈ తరగతి అంతకంతకూ ప్రభుత్వంతో ఎక్కువగా ఘర్షణపడుతూ వస్తుంది. ఆ విధంగా ప్రజల ప్రజాతంత్ర సంఘటనలో స్థానాన్ని పొందగలదుకూడా. అయితే ఈ సెక్షన్లు కూడా బడాబూర్జువా వర్గంతోకలసి ప్రభుత్వాధికారంలో భాగస్వాములుగా వుంటున్నారనీ, అటువంటి ప్రభుత్వం పరిపాలనలోనే బాగుపడగలమనీ ఆశిస్తున్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. దేశీయ బడా బూర్జువా వర్గం విదేశ సామ్రాజ్యవాదులతో పోటా పోటీలో తనకున్న బలహీన వర్గ స్థానాన్ని బట్టి ఈ సెక్షను వాస్తవరీత్యా అభివృద్ధికర స్వభావాన్ని కల్గివున్నా, అది అస్థిరమైన స్వభావం కలది. ఒకవైపున సామ్రాజ్యవాదులు, భారతదేశంలో వారి మిత్రులైన బడాబూర్జువా వర్గమూ, మరొకవైపున ప్రజాప్రజాతంత్ర సంఘటన, ఈ రెండింటిమధ్య ఇది మిక్కిలి ఊగిసలాట వైఖరిని ప్రదర్శిస్తూ వుంటుంది. ఇటువంటి ద్వంద్వస్వభావం కలది కావటంవల్లనే విప్లవంలో అది పాల్గొనే పద్ధతి అనేక వాస్తవ పరిస్థితులపై - వర్గశక్తుల బలాబలాలమధ్య వచ్చే మార్పులనుబట్టీ. సామ్రాజ్యవాదులకూ, భూస్వామిక వర్గాలకూ ప్రజలకూ మధ్యగల వైరుధ్యాల తీవ్రతనుబట్టీ, బడా బూర్జువా నాయకత్వం క్రిందవున్న బూర్జువా - భూస్వామిక ప్రభుత్వానికీ, జాతీయ బూర్జువా వర్గంలోని

ఇతర సెక్షన్లకూ మధ్యగల వైరుధ్యాల లోతునుబట్టి - నిర్ణయింపబడుతుంది.

(118) ప్రజాతంత్ర సంఘటనలోనికి ఈ సెక్షనును తెచ్చుటకు అన్ని ప్రయత్నాలూ చేయాలి. వారి సమస్యలను అతి శ్రద్ధగా పరిశీలిస్తూ జాతీయ గుత్తపెట్టుబడిదార్లకూ, విదేశీ సామ్రాజ్యవాద పోటీదార్లకూ వ్యతిరేకంగా ఈ సెక్షను జరిపే పోరాటాలకు సహాయం అందజేస్తానికి కార్మికవర్గం అవకాశం జారవిడువకూడదు.

(119) ప్రజాప్రజాతంత్ర విప్లవాన్ని సాధించుటకొరకై ప్రజాప్రజాతంత్ర సంఘటనను ఏర్పర్చటమనే తన మూలలక్ష్యాన్ని, ఈలక్ష్యం బూర్జువావర్గం నాయకత్వానవున్న ప్రస్తుతభారతప్రభుత్వంతో తప్పనిసరిగా తలపడవలసివస్తుందన్న వాస్తవవిషయాన్ని ఒక్కనిముషంకూడామర్చిపోకుండా కార్మికవర్గమూ,కమ్యూనిస్టుపార్టీ, బడాబూర్జువావర్గంతోసహా భారత బూర్జువావర్గానికీ, విదేశీ సామ్రాజ్యవాదులకూ మధ్యగల వైరుధ్యాలనూ, సంఘర్షణలనూ గుర్తుంచుకొంటుంది. ఈ వైరుధ్యాలూ, సంఘర్షణలూ, యుద్ధము, శాంతి సమస్యలపైనా, సోషలిస్టుదేశాలతో ఆర్థిక రాజకీయ సంబంధాల నేర్పుచ్చుకొనటంపైనా, విదేశీ గుత్తపెట్టుబడిదార్లనుండి షరతులు లేకుండాను, షరతులతోను సహాయాన్ని పొందటమూ, పొందకపోవటమూ అనే సమస్యపైనా, మన సరకులకు విదేశీమార్కెట్లు సంపాదించటం సమస్యపైనా ఇటువంటివే ఇతర సమస్యలపైనా, మరీ ముఖ్యంగా మన దేశపు సార్వభౌమాధికారం, స్వతంత్ర విదేశాంగ విధానముల సంరక్షణ విషయంపైనా బయలు దేరుతాయి. సామ్రాజ్యవాదులతో వచ్చే ఇటువంటి ప్రతి చిన్న తగాదాను చీలికను సంఘర్షణను వైరుధ్యాన్ని వుపయోగించుకొని సామ్రాజ్యవాదులను వేరు చేయటానికీ, ప్రజాతంత్ర పురోభివృద్ధికి జరిగే ప్రజా పోరాటాలను బలపర్చటానికీ

చూడాలి. పాలకపార్టీఅయిన కాంగ్రెసుతో వ్యూహాత్మక ఐక్యతగాని, ఐక్య సంఘటనగాని కుదురుతుందనే భ్రమకు ఏమాత్రం తావియకుండా, కార్మిక వర్గం అదే సమయంలో నిజమైన జాతీయ ప్రయోజనాలకు అనుగుణ్యంగా ప్రభుత్వం ప్రపంచ శాంతి, వలసవిధాన వ్యతిరేకత మున్నగు సమస్య లపై తీసుకొనే చర్యలకూ, సామ్రాజ్యవాదంతో ఘర్షణకు తావిచ్చే అన్ని ఆర్థిక రాజకీయ సమస్యలపైనా, మన దేశ సార్వభౌమత్వాన్నీ, స్వతంత్ర విదేశాంగ విధానాన్ని బలపర్చే చర్యలన్నిటిపైనా ప్రభు త్వాన్ని నిస్సంకోచంగా బలపర్చుటకు వెనుదీయదు.

దేశంలో అభివృద్ధి నిరోధక విప్లవ ప్రతీఘాతక ధోరణుల కన్నిటికీ ప్రత్యక్ష స్వరూపం స్వతంత్రపార్టీ కార్యక్రమం; అది తన జండా క్రింద అన్ని అభివృద్ధి నిరోధశక్తులనూ కూడగట్టాలని చూస్తు న్నది. పైగా, జనసంఘంలాంటి మత పార్టీలతో అది చేతులు కలపా లని చూస్తున్నది.

పబ్లిక్ రంగానికి వ్యతిరేకంగా ఈ శక్తులు దుర్మార్గమైన దాడి చేస్తున్నది; విదేశీ స్వదేశీ గుత్తపెట్టుబడిదార్లకు మరిన్ని సదుపాయాలు కల్గజేయమని ఒత్తిడి చేస్తున్నవి. విదేశీ పెట్టుబడి, అందులోనూ ముఖ్యంగా అమెరికన్ పెట్టుబడి చొచ్చుకు రావటానికి దాదాపుగా పూర్తి స్వేచ్ఛ యివ్వమని కోరుచున్నవి; సోషలిస్టుదేశాలతో వ్యాపారాన్ని చెడ గొట్ట ప్రయత్నిస్తున్నవి. వ్యవసాయ సంస్కరణలనన్నిటినీవారు వ్యతి రేకిస్తున్నారు. చైనాతో సైనిక సంఘర్షణ ప్రారంభమైన తర్వాత అమె రికా సైనికమైత్రి నేర్పర్చుకొమ్మని ధైర్యంతో వారు బాహటంగా కోరు చున్నారు. కమ్యూనిస్టుపార్టీ స్వతంత్రపార్టీయొక్క అభివృద్ధి నిరోధక సిద్ధాంతాలతోనూ, కార్యక్రమముతోనూ రాజీలేని పోరాటాన్ని సాగిస్తుంది.

(120) శాంతియుత మార్గాలద్వారా ప్రజాప్రజాతంత్ర ప్రభుత్వాన్ని సాధించటానికీ, సోషలిస్టు పరివర్తనను కొనిరావటానికీ భారత కమ్యూనిస్టుపార్టీ కృషిచేస్తుంది. బలీయమైన ప్రజాబాహుళ్యపు విప్లవ వుద్యమాన్ని అభివృద్ధి చేయడంద్వారా, పార్లమెంటరీ పోరాటరూపంతో పార్లమెంటు బయట జరిగే పోరాటరూపాలను జతపర్చటంద్వారా కార్మిక వర్గమూ, దాని మిత్రులూ, అభివృద్ధి నిరోధక శక్తుల ప్రతిఘటనను అధిగమించటానికీ, ఈ పరివర్తనలను శాంతియుత మార్గాలద్వారా తేవటానికి తన శక్తికొలదీ కృషిజేస్తుంది.

(121) అయితే, పరిపాలక వర్గాలు తమ అధికారాన్ని ఎన్నడూ స్వచ్ఛందంగా వదలుకోవనే విషయాన్ని సదా గుర్తుంచుకోవాలి. అవి ప్రజల అభీష్టాలకు ఎదురు తిరుగుతాయి; అరాజకం, బల ప్రయోగములతో ప్రజల అధికారాన్ని వమ్ము చేయాలని చూస్తాయి. కాబట్టి విప్లవ శక్తులెప్పుడూ జాగరూకతతో వుండాలి; ఎటువంటి అవాంతరాన్ని అయినా ఎదుర్కొంటానికీ దేశరాజకీయ జీవితంలో వచ్చే ఎటువంటి క్లిష్టపరిస్థితులనైనా, మార్పులనైనా, ఎదుర్కొంటానికీ వీలుగా అవి తమ పోరాటాన్ని మలుచుకొంటానికి సిద్ధంగా వుండాలి.

(122) విప్లశక్తులు, విప్లవవర్గాలు, పెట్టుబడిదారీ సిద్ధాంతాల మటుమాయలకు లోబడి, భ్రమపడకుండా, ఎల్లప్పుడూ సిద్ధాంతపోరాటం చురుకుగా, శక్తివంతంగా సాగిస్తూనేవుండాలి. విప్లవశక్తుల రాజకీయ చైతన్యస్థాయిని ఇనుమడింపచేస్తూ, శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతంవైపుకు వారిని మరల్చుతూ దానియందు వారికి స్థిరమైన విశ్వాసం పాదుకునేటట్లు చేయడం అత్యవసరం. పెట్టుబడిదారీసిద్ధాంతాలు, వాటిమీద ఆధారపడ్డ పెట్టుబడిదారీవిధానం విచ్ఛిన్నమయ్యేదశలోనే అతితీవ్రమైన సిద్ధాంత

సంక్షోభదశ తలఎత్తుతుంది. కమ్యూనిస్టు వ్యతిరేకత అనేది ఆ దశకు చిహ్నం. పాలకవర్గానికి ఈ కమ్యూనిస్టు వ్యతిరేకతే ప్రధానమైన ఆయుధం. ఈ ఆయుధంతో ఆ వర్గం ప్రజాస్వామికోద్యమాన్ని విచ్ఛిన్నపరచడానికి, తక్కిన ప్రజాస్వామికశక్తులనుండి కమ్యూనిస్టుపార్టీని వేరుచేయడానికి ప్రయత్నిస్తుంది. ఈ కమ్యూనిస్టు వ్యతిరేకాయుధం, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని తారుమారుచేసి, తలక్రిందులు చేయడానికి, సోషలిస్టువ్యవస్థను నిందలపాల్జేయడానికి, కమ్యూనిస్టువిధానాలను, ఆశయాలను వక్రీకరించడానికి, తుదకు శాంతియుతమైన ప్రజాస్వామికశక్తులను, సంస్థలను వేటాడి నిర్మూలించడానికి పూనుకుని ఎంత నైచ్యానికైనా పాల్పడుతుంది. కమ్యూనిస్టువ్యతిరేకత జాతిప్రయోజనాలకూ ప్రజాస్వామికోద్యమప్రయోజనాలకూ ప్రతికూలమైన దుష్టశక్తి కమ్యూనిస్టులైనవారు కమ్యూనిస్టువ్యతిరేకతను ప్రతిఘటించి, దానిని రూపుమాపడానికి యావచ్ఛక్తినీ వినియోగించి పోరాటంసాగించితీరుతారు.

**(123)** మత దురభిమానాన్ని, కులవర్ణవ్యవస్థను, మతోన్మాదాన్ని, జాతీయదురభిమానాన్ని అభివృద్ధినిరోధకులైన పెట్టుబడిదారీవర్గం ఆసరాగా తీసుకుని మన ప్రజాస్వామ్యఉద్యమాన్ని విచ్ఛిన్నపరచి, దాని అభివృద్ధిని అరికట్టజూస్తుంది. హిందీభాషాదురభిమానం ఇంతకుపూర్వమే తలయెత్తి, ఇతర భారతీయ భాషావర్గాల ప్రయోజనాలను ప్రతిఘటిస్తూ, వాటి అభివృద్ధిని కుంటుపరుస్తున్నది; వివిధభాషావర్గాల నడుమ ఈ విధంగా స్పర్థలు, సంఘర్షణలు చెలరేగుతున్నాయి. అవాంఛనీయములైన ఈ పరిణామాలు జాతిఅభివృద్ధికి తీవ్రమైన ఆటంకాలుగా నిలిచిఉన్నాయి. ఇంతేకాక ఐక్యకార్మికోద్యమానికి, విప్లవోద్యమానికి ఈ పరిణామాలు హానికరం. అందుచేత కమ్యూనిస్టుపార్టీ ఈ ధోరణులను ఎదిరించి పోరాడితీరుతుంది.

(124) కాంగ్రెసు పాలకవర్గం, ఇతర పెట్టుబడిదారీవర్గ నాయకులు "సోషలిస్టు" పదప్రయోగాలతో సామాన్యప్రజల నీనాడు మోసపుచ్చుతున్నారు. ఈ నాయకులు "సోషలిస్టువిధానం" కావాలని ఒకవంక బూటకప్రచారం కావిస్తూనే, సిసలైన సోషలిస్టు వ్యవస్థకొరకై ప్రజలు, కార్మికకర్షకులు సాగించేపోరాటాలను ప్రక్కదార్లుపట్టించి, ప్రజలను వాటినుండి దూరంచేస్తున్నారు. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలమీదా కమ్యూనిస్టుపార్టీమీదా తాముచేసే దాడులను కప్పిపుచ్చుకోడానికై, ఈ వర్గాలవారు సోషలిస్టు నినాదాలను ధారాళంగా వల్లిస్తూవుంటారు. కాంగ్రెసు ప్రభుత్వం తీసుకునే చర్యలు ఏవిధంగానూ సోషలిస్టుచర్యలుకావనీ, ఈ పెట్టుబడిదారీ పెద్దలు వల్లించే సిద్ధాంతాలలో కలికానికికూడా శాస్త్రీయ సోషలిస్టుభావాలు కానరావనీ కమ్యూనిస్టుపార్టీ ప్రజలకు వివరంగా నచ్చచెబుతున్నది.

(125) ప్రజాస్వామిక శక్తుల ఐక్యతకొరకూ, పటిష్ఠతకొరకూ, మితవాద సోషలిస్టుమతాలవారు సాగించే విచ్ఛిన్నకరమైన కమ్యూనిస్టు వ్యతిరేకప్రచారాన్ని నిరంతరం బహిర్గతంచేస్తూ, పోరాటం కొనసాగించడం, సిద్ధాంతచర్చలు జరపడం, రాజకీయపోరాటం నడపడం ఎంతైనా అవసరం.

(126) ప్రజాప్రజాతంత్రప్రభుత్వం ఏర్పడడం, ప్రజాతంత్ర కర్తవ్యాలను జయప్రదంగా పూర్తిచేయడం, ప్రజా ప్రజాతంత్ర ప్రభుత్వంలో కార్మికవర్గ నాయకత్వం ఏర్పడడం మూలంగా భారతదేశ విప్లవం ప్రజాతంత్ర దశవద్ద ఆగిపోకుండా సోషలిస్టు సమాజ పరివర్తనను సాధించే దశకు అతి త్వరగా సాగిపోతుంది.

(127) భారతకమ్యూనిస్టుపార్టీ ఈ కార్యక్రమాన్ని ప్రజల ముందుపెట్టి, తక్షణం ఈనాడు తీసుకోవలసినచర్యలకు అధికప్రాధాన్యం

చూపుతున్నది. ప్రజలు తామే ఆశయాలకు పోరాడాలనో, ప్రజాస్వామిక పద్ధతులపై దేశాభివృద్ధిని సాధించడానికి ఏ మార్గం అనుసరించాలనో ఈ కార్యక్రమంలో ప్రత్యక్షంగా కళ్ళకుకట్టినట్లు కన్పిస్తుంది.

(128) పైన పేర్కొన్న కార్యక్రమాన్ని అమలుజరపడానికీ, తద్వారా జాతీయాశయాన్ని సాధించి సాధారణ ప్రజల జీవితవిధానాన్ని సుఖప్రదంచేయడానికీ, కోటానుకోట్ల కష్టజీవులూ, కార్మికవర్గమూ, కర్షక జనసామాన్యమూ, శ్రమజీవులైన మేధావులూ, మధ్యతరగతిప్రజలూ, దేశాభ్యుదయం కాంక్షించే జాతీయపెట్టుబడిదారీ వర్గాలూ ప్రజా ప్రజాతంత్ర సంఘటనలో సంఘటితంకావాలని కమ్యూనిస్టుపార్టీ కోరుతున్నది.

(129) భారతీయుల పోరాటసంప్రదాయాలను కమ్యూనిస్టుపార్టీ ముందుకుతీసుకొనిపోతున్నది. భారతీయుల దేశభక్తినీ, అంతర్జాతీయ శ్రామికుల విశ్వసౌభ్రాతృత్వాన్నీ కమ్యూనిస్టుపార్టీ మేళవిస్తుంది. తన నిత్య కార్యకలాపాల్లో, దైనందిన పోరాటాలలో కమ్యూనిస్టుపార్టీ మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల ప్రాతిపదికమీద కాలూని, ముందుకు నడుస్తుంది. ఈ సిద్ధాంతాలే దానికి మార్గదర్శకంగా ఉంటాయి. వాటి ద్వారానే శ్రమజీవులు గురయ్యే దోపిడీవిధానం, దారిద్ర్యం, నిరుద్యోగం, నికృష్టజీవనం తుదముట్టి, వారు విముక్తిచెందుతారు. త్యాగధనులూ, విప్లవచైతన్యవంతులూ, పోరాటపటిమగలవారూ అయిన శ్రామిక జన సామాన్యాన్ని — స్త్రీ పురుషులతో సహా — కమ్యూనిస్టుపార్టీ తన మహా విప్లవసంస్థలో ఇముడ్చుకొని, వారిని విప్లదీక్షగల మార్క్సిస్టు-లెనినిస్టులుగానూ, విశ్వసౌభ్రాతృత్వ దృక్పధంగల శ్రామికవర్గ అంతర్జాతీయ వాదులుగానూ అభివృద్ధిచేయ పూనుకుంటుంది. ప్రజాస్వామికవాదులైన దేశభక్తులను ఐక్యపరచి, ప్రజాస్వామిక విప్లవాన్ని కొనసాగించి, బ్రహ్మాండమైన ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నిర్మించడానికై కమ్యూనిస్టు

పార్టీ తన శక్తియుక్తులను ధారపోసి, ఈ కార్యక్రమం జయప్రదమయ్యే టట్లు కృషిచేసితీరుతుంది.

(130) ఈ విప్లవపోరాటంలో భారతకమ్యూనిస్టుపార్టీ తన ఆశయాన్ని సాధించడంద్వారా, విశ్వవ్యాపితంగా, జాతీయస్వాతంత్ర్యం కోసం, ప్రజాస్వామికంకోసం, సోషలిజంకోసం, శాంతికోసం జరిగే మహాపోరాటంలో ఉచితస్థానాన్ని అలంకరించితీరుతుంది. మన కమ్యూనిస్టుపార్టీ, 1960 లో మాస్కోలో జరిగిన 81 మార్క్సిస్టు - లెనినిస్టు శ్రామికవర్గపార్టీల ప్రతినిధులసభచే ఆమోదింపబడ్డ ప్రకటనను సమర్థిస్తుంది; అంతేకాకుండా అంతకుక్రితమే 1957 లో ప్రపంచరాజకీయ పరిస్థితిని ప్రతిబింబింపజేస్తూ ఆమోదించబడిన ప్రకటనసుకూడా మన కమ్యూనిస్టుపార్టీ సమర్థిస్తుంది. అంతర్జాతీయ కార్మికవర్గానికీ, అభ్యుదయ శక్తులకూ, అన్నిదేశాల కమ్యూనిస్టుపార్టీలకూ ఈ రెండుప్రకటనలూ విప్లవపంథాను చూపెట్టే అమూల్యములైన పత్రాలుగా భావించుతున్నాం. ఈ రెండుపత్రాలలో పొందుపరచబడిన విప్లవసిద్ధాంతాలు మార్క్సిస్టు - లెనినిస్టు పవిత్రతను పరిరక్షిస్తూ, కమ్యూనిస్టుపార్టీలలోని మితవాద, పిడివాద, దుందుడుకుదోరణులయొక్క ప్రమాదాలనుంచి సభ్యులను కాపాడుతూ, సోషలిస్టు ఆశయసిద్ధికి మార్గం చూపుతున్నాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రస్తుతం మితవాదతత్వం ప్రవేశించిన కారణంచేత, ఈ మహాఉద్యమం, విచ్ఛిన్నమయ్యేప్రమాదం ఏర్పడింది. ఈ మితవాద ధోరణులను భారతకమ్యూనిస్టుపార్టీ నిర్మూలించి, ఈ మహాప్రమాదంనుండి ప్రపంచ మార్క్సిస్టు ఉద్యమాన్ని రక్షించడానికి ప్రతిజ్ఞ పూనుతుంది. అలాగే పిడివాద, దుందుడుకుధోరణులకు వ్యతిరేకంగా మన పార్టీపోరాటం సాగించితీరుతుంది. పెట్టుబడిదారీవిధానం సామ్రాజ్యవాదం విశ్వవ్యాపితంగా చావుదెబ్బతింటున్న ఈ నూతన పరిస్థితుల్లో

దేశవిముక్తిపోరాటాలూ, సోషలిస్టు విప్లవాలూ జయప్రదం కావడానికి అనుకూలపరిస్థితులేర్పడ్డాయి. ఇట్టిపరిస్థితుల్లో, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో తలఎత్తిన అనైక్యతను భగ్నంచేసి, వాస్తవస్థితిగతులకు అనుగుణంగా, ఈ మహోద్యమంలో మరల ఎప్పటివలెనే ఐక్యతను, సంఘటితశక్తిని ప్రవేశపెట్టడానికీ, ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమం ఇతోధికంగా ప్రపంచ పీడిత ప్రజాసామాన్యానికి సేవచేయడానికి మన పార్టీ కృషిచేస్తుంది.

(131) మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలమూలంగానూ, దేశ దేశాలలో పటిష్టమైన కమ్యూనిస్టుపార్టీల నాయకత్వంమూలంగానూ, ప్రపంచమానవుల్లో మూడోవంతుకుపైగా ప్రజానీకం సోషలిస్టు వ్యవస్థ క్రిందకి రాగల్గారు. వారందరూ స్వేచ్ఛావాయులు పీల్చుతూ, నిసలైన ప్రజాస్వామికాన్ని అనుభవిస్తూ, సుసంపన్నమూ, సమగ్రమూ అయిన సుఖజీవితం గడుపుతున్నారు. 90 పార్టీలకు పైగా కలిగి, నాలుగుకోట్లకు మించిన సభ్యులతో, ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమం, ప్రపంచచరిత్రలో కనీవిని ఎఱుగని మహత్తరమైన, అభ్యుదయకరశక్తిగా దిగ్విజయంతో పురోగమిస్తున్నది. ప్రపంచవ్యాప్తమైన ఈ మహోద్యమం తన సోష లిస్టు ఆశయాన్ని సాధించితీరుతుంది; దానినెవరూ అరికట్టలేరు.

(132) కార్మికవర్గ నాయకత్వంక్రింద, కమ్యూనిస్టు నాయకత్వం క్రింద మార్క్సిస్టు - లెనినిస్టుబోధనలను అనుసరించి భారతప్రజలు ఈ కార్యక్రమాన్ని ఆమోదించి అమలుజరుపుతారనీ, విప్లవం సాగించితీరుతా రనీ భారతకమ్యూనిస్టుపార్టీ విశ్వసిస్తున్నది. భారతదేశంకూడా విజయ వంతంగా ప్రజాస్వామికరాజ్యంగా పరిణమించింది. సోషలిస్టు ఆశయ మార్గంలో పురోగమించగలదని భారతకమ్యూనిస్టుపార్టీ విశ్వసిస్తున్నది.

—o—

చ ం దా దా ర్లు గా చే ర ం డి!

1964 జూన్‌నుండి ద్వైవార పత్రికగా వెలువడనున్న-

# జ న శ క్తి

(ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టుకమిటీ అధికార పత్రిక)

సంవత్సర చందా : 20-00

అర్ధ సం॥ చందా : 10-00

3 మాసముల ,, : 5-00

విడిప్రతి : 0-20

86.

మా
తరువాతి ప్రచురణ :

# సిద్ధాంత సమస్యలు

---

"భారత కమ్యూనిస్టుపార్టీ ముసాయిదా కార్యక్రమం"
కొరకు వెంటనే మీ ఆర్డర్లు పంపండి!

మార్క్సిస్టు ప్రచురణలు
బకింగ్‌హాంపేట, విజయవాడ -

